# కాంతి శిఖరాలు




రచయిత :

పి. హుసేన్‌ఖాన్

ఉత్తమ ఉపాధ్యాయ జాతీయ బహుమతి గ్రహీత

అనువాదం :

పచ్చిపులుసు వెంకటేశ్వర్లు

ఉత్తమ ఉపాధ్యాయ రాష్ట్ర బహుమతి గ్రహీత

ప్రథమ ముద్రణ : డిశంబరు 1987

ప్రతులు : 1000

ముద్రణ : వావిళ్ల ప్రెస్, కావలి.



వ ల యు వా రు

1) జఫర్ బుక్ డిపో, కచ్చేరిమిట్ట, కావలి, నెల్లూరు జిల్లా.
2) మదీనా బుక్ డిపో, చిన మసీదు, ఒంగోలు.
3) రహీమియా బుక్ డిపో, అంజుమన్ బిల్డింగు, గుంటూరు.
4) ఉర్దు బుక్ స్టాల్, ఇస్లాంపేట, విజయవాడ.
5) కమర్షియల్ బుక్ డిపో, ఛార్మినార్, హైదరాబాద్-500 002.
6) మక్తా-బా-యె-దారుల్-ఖురాన్, షాహీపేట, కడప-516 001.
7) ఖురాన్ బుక్ సెల్లర్, 13/85 చౌక్ కడప-516 001.
8) అహ్మద్ అలి బుక్ సెల్లరు, ముఅజ్జమ్‌జాహి మార్కెట్, హైదరాబాద్.
9) Md. అస్లమ్‌ఖాన్, బుక్ సెల్లర్, రహమతాబాద్, నెల్లూరు జిల్లా.
10) దఫ్తర్-మజలీస్-యే-ఇల్‌మియ్యా, మహబూబ్ బజార్, చాదర్‌ఘాట్, హైదరబాద్-500 024.
11) జియా బ్రదర్స్, కర్నూలు-518 001.
12) సిరాజ్ బుక్ డిపో, ఖిలామస్జిద్, వెల్‌గోడ్-518 533.
13) కౌసర్ బుక్ ఏజన్సీ, కదిరి-515 591.
14) S. అబ్దుస్‌సలామ్, బుక్ సెల్లరు, కసుమూరు-524 325 నెల్లూరు జిల్లా.



# కాంతిశిఖరాలు


ర చ యి త :

పి. హసేన్‌ఖాన్

జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ బహుమతి గ్రహీత

రిటైర్డు ఉర్దుమున్షీ జిల్లాపరిషత్ హైస్కూలు

కా వ లి, నెల్లూరు జిల్లా.



ప బ్లి ష ర్ :

ముస్లింపుర - కావలి

నెల్లూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.




NATIONAL TEACHERS AWARD

S.S. GANDHI
Editor

THE DEFENCE REVIEW
N-74, Greater Kailash-1,
New Delhi-110 048.
Tel: 641 9457

KHAN, P. HUSSAIN - Urdu Munshi Grade I,
Zilla Parishad Boys High School,
KAVALI, Nellore Dist. A.P. (1981)

Born 01 Juyl 1925, Prakasam, A. P. Father P. Fathekhan, Ed. Adib-i-Fazil (Urdu Diploma); Stud. Islamiya Arabic College - Kurnool; Started as Grade II Urdu Munshi 1946; Joined School of award, 1970; a respected teacher excellent at human relations; a special benefactors of poor students with learning aptitudes; a regular contributor of articles to urdu magazines; author of books including a grammer text 'Hafeez-ul-Qawaid' which has been approved by the Board of studids of Andhra, Annamalai, Madras and Venkateswara Universities; has donated his cash award for instituting two scholarships; United State Library (USIS) has selected his book 'Shuaa-E-noor for American Libraries; recipient of State Teachers award, 1980.

అమిత దయామయుడు మరియు కరుణామయుడగు అల్లాః పే-

# ప రి చ య ం వు౹

రాత్రులు ప్రయాణము చేయు ప్రయాణికులకు నిర్మల ఆకాశములో మెరుస్తున్న నక్షత్రాలు దిక్కులు సూచించి ప్రయాణ మార్గమును సులభతరము చేస్తాయి. ప్రయాణికులు వాటి మార్గ దర్శకత్వములో తమ గమ్యాన్ని చేరుకున్నట్లే, ఆదర్శ పురుషులు, పుణ్యమూర్తుల జీవిత దర్పణములో సత్య మార్గ ప్ర యా ణి కు లు నిశ్చింతగాను, తృప్తికరముగాను తమ ప్రయాణమును కొనసాగిస్తూ సఫలీకృతులౌతుంటారు. ఈ పుణ్యమూర్తుల సత్ ప్రవర్తన-సత్ ఆచరణ యొక్క అమూల్య ఉదాహరణలు, అంతరాత్మలను సైతం మేలుకొల్పే సత్ సంఘటనలు. ఉద్రేకపూరితమైనవి, ఆసక్తికరమైనవి మ రి యు ఆకర్షణియమైన ఉదాహరణలు, ఆదర్శాలు, ఋజు ప్రవర్తన యొక్క అద్భుత వృత్తాంతములు. ఈ చిన్న పుస్తకములో క్రోడీకరించబడినవి. వీటివల్ల ప్రేరేపణ శక్తి లభ్యమౌతుంది.

ఇందలి వ్యాసములు వాస్తవములో అంతరాత్మను జాగ్రత పర్చు ఆత్మకాణుల్తై యున్నవి. ఇందలి ప్రతి వ్యా స ము, అంశము

ఆరాటము, ఆకర్షణ, ప్రేరేషణలతో కూడి ఊహాజనిత భావఉద్రేక ములతో మిమ్మల్ని అకట్టుకొనే నిర్మాణాత్మక సామర్థ్యము కలిగి యున్నవి. అల్లాః ఎవరికైతే అవధానము - సమయస్ఫూర్తి - జ్ఞానము బాధ్యతలను గుర్తించగలిగే వ్యక్తిత్వములు. ఆలోచించగల మనస్సు మేధస్సు ఎవరికి ఇచ్చెనో అట్టివారే ఈ ఆదర్శపుష్పాలనుండి విజ్ఞానపు తేనెను జుర్రుకోగలరు.

మెలుకువ కలిగిన మేధస్సు - వాస్తవికతను చూడగలిగే మనో నేత్రములు కలవారికి ఇందులో రహస్య సంకేతములు ఉన్నవి. శీలము-నడవడిక గలిగిన ఈ నమూనాల పాఠ్యమువల్ల అల్లాఃచే సృష్టించబడిన మానవులతో మానవత్వముతో ప్రవర్తించుట-ప్రేమించు ఆశక్తి ప్రేరేపణ కలుగుతున్నది. మరియు జీవితముయొక్క రాజబాట పైనడిచే వారికి ఈ పుస్తకము మార్గగుర్తు-మార్గ దీప్తికలు అయివున్నది వాటి మార్గ దర్శకత్వములో పయనించే సమూహములు ఋజుమార్గము నుండి జారిపోజాలవు. పూర్వీకుల నిర్మల నడవడికలకు భాగముకూడ హితవు మరియు గుణపాఠములు లేకుండా ఖాళీగా లేదు ప్రస్తుత వర్త మానకాలములో యువకులు మరియు పిన్న వయస్కులు (పిల్లలు)కు ఇట్టి ఆదర్శాలు చాలా అవసరము. వారు వాటి అడుగు జాడలలో నడిచి తమ జీవితములను సాఫల్యము గావించుకొందురు. ఈ స్వల్ప బహుమతి పిల్లలు మరియు యువకులకు గమ్యానికి చేరుకునే ప్రయత్న ములో బాగా తోడ్పడగలదని ఆశిస్తున్నాను. ఇది మార్గ-దీప్తిక కూడ కాగలదని భావిస్తున్నాను.

ఈ అమూల్య బహుమాన ప్రతి పిల్లవాడు మరియు యువకుల చేతులను అలంకరించ గలందులకు అల్లాః సన్నిధితో ప్రార్థిస్తున్నాను. క్రోడీకరణ సమయములో దొల్లిన తప్పులను మన్నించి ఇహపరములలో దేవుడు నన్ను సఫలీకృతుడు గావించగలందులకు అల్లాః సన్నిధిలో వేడుకొనుచున్నాను, ఆమీన్.

మిస్లింపూర్
బావలి

ఇట్లు
హుసేన్ ఖాన్.



వై. సుబ్రహ్మణ్యంశాస్త్రి, యం. ఏ.,
విద్యాప్రవీణ (సంస్కృత సాహిత్యం)
భాషాప్రవీణ (తెలుగు & హిందీ)
తెలుగు లెక్చరర్, జవహర్ భారతి, కావలి.

జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ బహుమతి గ్రహీత, రచయిత పండిత శ్రీ పి. హుసేన్‌ఖాన్‌గారు దయతో పంపిన "కాంతిశిఖరాలు" అను గ్రంథమును చదివితిని. ఇందు ఆసక్తికరమైన 18 కథలు కలవు ఒక్కొక్క కథ ఆణిముత్యమువలె ప్రకాశించుచు ధర్మపథ ప్రదర్శనము మున్నది. నైతికవిలువలు సమూలంగ నశించి అవినీతికి నిలయమైన ప్రస్తుత నవసమాజమున ఇట్టి కథలను చదివి మననం చేసికొని ఆచరించుట అత్యావకాశము. ఆధునిక సమాజ రుగ్మతకు నిదానము నీతి కథలు లేక పోవుటా? కాదు. నీతి కథలను చదువకపోవుటా? కానేకాదు. మరి!... సర్వవిధితమే నీతి విదూరమైనజాతి సన్యముగా బ్రతుకలేదు. నేడు వైజ్ఞానిక ప్రగతి పథమున పయనిస్తున్నాము. దౌర్భాగ్యపు దుర్గతి పథమున పాతాళమునకు పయనిస్తున్నాము తెలియదు. ఏది ఏమైనను, 'సులువైన మార్గము' 'న్యాయమంటే ఇదే' 'అపార్థము' – కథలు నన్ను బాగా ఆకర్షించినవి. 'మనమెందుకు' జన్మించాము?, అందరికీ తెలిసిన విషయమైనను పాఠకుని శరీరము గగుర్పొడుచును. వయస్సుతో నిమిత్తంలేక అందరూ చదవదగిన కథలు. వినోద విజ్ఞానప్రదములైన కథలు.

ధర్మమార్గ ప్రదర్శకములైన ఇట్టి కథలను ఇంకనూ రచించి ఆంధ్రలోకానికి అందించుటకు జనాబ్ పి. హుసేన్‌ఖాన్‌గారికి, పరమాత్మ ఆయురారోగ్య భాగ్యములను ప్రసాదింప ప్రార్థింతును.

తే 12-12-87 ది
కా వ లి.

సుజన విధేయుడు
యనమండ్ర సుబ్రమణ్యశాస్త్రి
Administrative Officer
INTERMEDIATE WING,
Jawahar Bharati, Kavali

సాహిత్య విద్యా ప్రవీణ
బాషా ప్రవీణ
కె. యస్. రామానుజాచార్యులు, ఎం.ఏ.,
ప్రిన్సిపాల్
వేద & సంస్కృత కళాశాల.

మూలపేట
నెల్లూరు — 3
తే 23-7-87

మిత్రులు శ్రీ జనాబ్ హుస్సేన్‌ఖాన్‌గారు నాకు చిరపరిచితులు. వీరు చక్కని రచయితలు. ఉర్దూలోను, తెలుగులోను అనేక గ్రంథములను విద్యార్థుల హితమును దృష్టిలో ఉంచుకొని రచించి ప్రచురించి యున్నారు. రాష్ట్ర బహుమతిని, రాష్ట్రపతి బహుమతిని ఉత్తమ ఉపాధ్యాయులుగా ఎన్నికై గెలిచిన ఉర్దూ పండితులు వీరు. సౌజన్యమూర్తి.

'కాంతి శిఖరాలు' అనుపేరుతో ప్రస్తుతం వీరు రచించిన ఈ నీతి కథావళి పిన్నలకు, పెద్దలకును ఎంతో ఉపకారకము. రచనాశైలి అత్యంత సరళము. ప్రాచీన ఉర్దూ సాహిత్యము నుండి చక్కని కథలను ఇందు పర్చి గూర్చినారు. పాఠకుడు వీనిని చదివి ఆత్మావలోకనము చేసికొనినచో తని జీవితమును మంచి మార్గమున మలచుకొనవచ్చును. ముఖ్యముగ విద్యార్థులు తప్పక చదువదగిన నీతి గ్రంథము ఇది. ఈ చిన్ని కథలను చదివినందువలన ధర్మ సూక్ష్మములు చక్కగ తెలియ గలవు.

కావున ఆంధ్ర పాఠకలోకము ఈ 'కాంతి శిఖరాల' ను ఆదరించునుగాక. శ్రీ హుస్సేన్‌ఖాన్‌గారికి ఇటువంటి ఉత్తమ గ్రంథములను రచించుటకు భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు
బుధజన విధేయుడు,
K. S. రామానుజాచార్యులు

—: విషయసూచిక :—

పేజి నెం.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

కరుణామయుడు, అత్యంత దయామయుడగు

అల్లాహ్ పేర (ప్రారంభము)

# 1. తిరుగులేని తీర్పు

ఒక అబల అతి దీన వదనంతో మహాప్రవక్త (సొ) సన్నిధిలో నిలుచున్నది. ఆ అభాగిని కంటికి కడివెడుగా ఏడుస్తున్నది. తన సర్వస్వాన్ని కోల్పోయి దీనాతి దీనంగా విలపిస్తున్నది.

కరుణామయులైన ప్రవక్తగారు ఆమెకు ఊరట పలికారు. ఆమె దీనగాధను చెప్పమన్నారు.

"ఓ దయానిధీ! నేను కష్టాలలో కాపురం చేస్తున్నాను. న్యాయ భిక్ష పెట్టండి మహాప్రభో! నా భర్త నన్ను పోషించక, తరిమివేశాడ. నేను దిక్కులేని దాన్నయాను. భర్త ప్రేమానురాగాలకు దూరమయాను. నేను కంటికి రెప్పలా పెంచుకున్న కన్న కొడుకును కావాలంటున్నాడు. ఈ దీనావస్థలో నా ఏకైక ఆధారం వీడు సుగుణాల ప్రోవు. తలిదండ్రుల పట్ల, పెద్దలపట్ల గౌరవాదరాలు చూపుతాడు. వీణ్ణి చూసుకునే బ్రతుకు తున్నాను. నేను అసహాయను, ఆడదాన్ని. బయటకువెళ్ళి పనిచేయలేను.

నాకు వీడు రోజూ నూతినుండి నీళ్ళు తెచ్చిస్తాడు. బజారుకువెళ్ళి కావలసిన వస్తువులు తెచ్చి పెడ్తాడు. వీణ్ణి చూసుకునే బ్రతుకుతున్నాను నా భర్త వీణ్ణి దౌర్జన్యంగా తీసుకెళ్ళాలని చూస్తున్నాడు. వీడు లేకుండ నేనెలా బ్రతికేది" అంటూ తన దయనీయ స్థితిని చెప్పుకున్నది.

"అమ్మా! పరమ దయామయుడైన 'అల్లాహ్' నిన్ను కాపాడుతాడు ఆర్చేవాడు, తీర్చేవాడు ఆ అల్లా ఒక్కడే ఆ అల్లాహ్‌ను నమ్ము. దుఃఖం మాను" అని ఓదార్చారు ప్రవక్త (సొ).

"ఓ కరుణామూర్తీ! నా భర్త మీ సమక్షములోనే ఉన్నాడు అతనికి బుద్ధి చెప్పండి నాకు న్యాయం చేయండి."

ఇంతలో ఆమె భర్త ప్రాధేయపడుతూ ప్రవక్త (సొ) గారితో "ఓదైవ ప్రవక్తా! వీడు నాబిడ్డ నాబిడ్డను తీసుకునే హక్కు ఎవరికుంది? వీణ్ణి సమర్థుణ్ణిగా, ప్రయోజకుడి గాచేసే బాధ్యత నాది ఇన్నాళ్ళు నా రెక్కలు ముక్కలు చేసుకొని పెంచి, పోషించిందెందుకు? నాబి డ్డ నా వద్ద ఉండాల్సిందే గదా!" అని మొరపెట్టుకున్నాడు.

ఆ తల్లి హృదయం విలవిలలాడింది. "ప్రభూ! ఇది అన్యాయం వాడు నాబిడ్డ. నారక్తాన్ని పాలుగామార్చి వీణ్ణి సాకాను. ఎన్నో కష్టాల్ని సహించి ఈ చిట్టి తండ్రిని పోషించాను. వీడు నా జీవనాధారము వాణ్ణి నాకు దూరం చేయవద్దు."

ఆ తల్లి వేదన, తండ్రి వాదన విన్నారు ప్రవక్త. వారికి ఆ తల్లి పరిస్థితిపట్ల జాలి కలిగింది. ఆ దయామయుని కళ్ళు చెమ్మగిల్లాయి. తాము తీర్పు చెప్పాలి భార్యభర్తలు ఇద్దరి వైపూ చూచారు. ఉభయులూ తమ కుమారుణ్ణి అనురాగంతో చూస్తున్నారు.

ఒక్క క్షణం ఆలోచించారు. పిల్లవాణ్ణి పిలిచారు. "బాబూ ఇతడు మీ నాన్న. ఈమె మీ తల్లి. వీరిద్దరూ నీకు కావలసినవారే, వీరిలో ఎవరి చేతినైనా పట్టుకునే అధికారం నీకుంది. నీ ఇష్టమొచ్చిన వారి వెంట నీవు వెళ్లచ్చు"

పిల్లవాడు లేచి నిలబడ్డాడు. ఇద్దరివైపూ చూచాడు. ఇద్దరూ తనను ఎత్తుకొని ముద్దాడేందుకు ఆతృత పడుతున్నారు.

ఒక్క నిమిషం ఆగి ఒక అడుగు ముందుకు వేశాడు. నిస్సహాయురాలుగా, మమతానురాగాలతో తన వైపు చూస్తున్న తల్లి చెయ్యి పట్టుకున్నాడు.

# 2. సులువైన మార్గము

ఒక రోజు హజరత్ రసూలుల్లాహ్(సో) వద్దకు ఒకడు వచ్చాడు. "ఓ రసూలుల్లాహ్‌గారూ! నాకు కొన్నిదుర్వ్యసనాలున్నాయి. దొంగతనం చేస్తాను. త్రాగుడుంది, వ్యభిచారంకూడా చేస్తాను. ఇంకా యిలాంటివి కొన్ని ఉన్నాయి. వీటన్నిటికీ నేను అలవాటుపడి ఉన్నందున వదులు కోవడం చాలా కష్టంగా ఉంది. సన్మార్గంలో పోయేందుకు ఏదైనా సుళువైన మార్గం ఉపదేశించండి. నేను దాన్ని తప్పక ఆచరిస్తాను" అన్నాడు.

అప్పుడు హజరత్ రసూలుల్లాహ్ (సో) "ఏమయ్యా! అబద్దం చెప్పనని ప్రతిజ్ఞ చేయగలవా?" అని అడిగారు.

అతడు "రసూలుల్లాహ్‌గారూ! ఇది చాలా సులభమైంది. నేను అబద్దం చెప్పనని వాగ్దానం చేస్తున్నాను" అన్నాడు.

'ఇది చాలా చిన్న విషయమే గదా!' అని సంతోషంగా వెళ్ళిపోయాడా వ్యసనపరుడు.

"నన్ను వ్యసనాలేమీ మానమని చెప్పలేదు. అబద్దం మాత్రం చెప్పవద్దన్నారు. దీన్ని సుళువుగా అవలంబించవచ్చులే." అని అనుకున్నాడు.

రాత్రయింది. మామూలు ప్రకారం దొంగతనానికి బయలు దేరాడు. ఇంతలో మనసు పనిచేయడం ప్రారంభించింది. ఆలోచనలో పడ్డాడు. 'రేపు హజ్రత్‌గారి దర్బారులో రాత్రి ఎక్కడి కెళ్లావని ప్రశ్నిస్తారనుకో. అప్పుడేమి చెప్పాలి. అబద్ధం చెప్పకూడదుగా; నిజం చెప్తాననుకో. దొంగతనం చేశానంటాను. మరి దొంగతనానికి శిక్ష విధిస్తారు. నా చెయ్యి నరికివేస్తారు. ఒకవేళ అబద్ధం చెప్తాననుకో. అమ్మో! చేసిన ప్రతిజ్ఞ భంగమౌతుందే. ఇలా ఆలోచించి దొంగతనం మానివేశాడు,

తర్వాత తాగుడు, వ్యభిచారం జ్ఞాపకమొచ్చాయి. కాని మనసులో మథన ప్రారంభమయింది. రేపు దర్బారుకు వెళ్ళిన తర్వాత తాగుడు, వ్యభిచారాన్ని ఒప్పుకున్నట్లైతే రాళ్ళతో కొట్టి నన్ను చంపివేస్తారు అయితే అబద్ధం మాత్రం చెప్పలేను. నేను చేసిన ప్రతిజ్ఞను నేనే ఎట్లా తిరస్కరించేది? ఇలా ఆలోచించి ఆ ప్రవక్తగారి బోధన వలన దొంగతనం, తాగుడు, వ్యభిచారం అన్నిటినీ మానివేసి సన్మార్గుడయ్యాడు.

# 3. అతిథి సత్కారము

హజ్రత్ మహమ్మద్ (సొ) గారి వద్దకు ఒక వ్య
వచ్చి ఆకలితో ఉన్నట్లు చెప్పాడు. అప్పుడు రసూలుల్లాః (స
గారు తన భార్య వద్దకు ఒక మనిషిని పంపారు. ఆమె అల్లాః
ఒట్టు పెట్టుకొని మంచినీరు తప్పితే తినేందుకు ఏమీ లేద
చెప్పి పంపించారు.

హజ్రత్‌గారు రెండవ భార్య వద్దకు పంపించారు. ఆ
కూడా అలాగే చెప్పి పంపించారు. అలాగే అందరు భార్య
వద్దకు వెళ్ళితే అందరూ అలాగే చెప్పి పంపారు.

అప్పుడు రసూలుల్లాః (సొ) గారు తన అనుచరుల
పిలిచి "ఎవరు ఈ అతిథికి ఈ రాత్రి తిండి పెట్టి సత్కరిం
గలరో వారికి దేవుని అనుగ్రహం తప్పక ఉంటుంద"ని చెప్పారు

హజ్రత్ అబూతల్హా అన్సారీ (రజీ) లేచి, తాను అతిథి
ఇంటికి తీసుకువెళ్ళి సత్కారం చేస్తానని వెంటపెట్టుకపోయాడు.

అబూతల్హా ఇంటికి వెళ్ళి భార్యతో "తినటానికేమయినా
ఉందా? అతిథిని వెంట తీసుకుని వచ్చాను. ఇంట్లో ఏదున్నా
అతిథికిచ్చి సత్కరించు" అని చెప్పారు.

భార్య " పిల్లలకు సరిపోయే మోయిన భోజనముంది. అది తప్ప మరేమీ లేదు " అన్నది.

అబూతల్హా "పిల్లలకు ఏవైనా ఆట వస్తువులిచ్చి, మరపించి నిద్రపుచ్చు. అతిథి రావడం తోటే ఇంటిలో తినటానికేముందో అది తెచ్చి ముందుంచు. అతిథి తోటి మనమూ కూర్చుని తినడం మన సంప్రదాయం కదా! అయితే ఉన్న అన్నం మనకూ అతిథికి చాలదు. నేను, అతిథి కూర్చొని ఉండగా నీవు దీపం సరిచేస్తున్నట్లు నటిస్తూ దీపం ఆర్పివేయ్యి. ఆ చీకటిలో మనిద్దరం ఆహారం చేతిలోకి తీసుకుని తింటున్నట్లు నటిద్దాం. అతిథికి ఉన్న దంతా పెట్టుదాం" అని వివరించారు. భార్య సరేనన్నది.

అతిథి వచ్చాడు. ముగ్గురూ కూర్చున్నారు. భార్య మెల్లగా దీపం ఆర్పింది. ఆ చీకటిలో తింటున్నట్లు నటించారు భార్యాభర్తలు. అతిథి ఆహారమంతా తిన్నాడు. అతణ్ణి సాగనంపారు. అలా అతిథి సత్కారం చేశారు.

తెల్లవారి హజ్రత్ అబూతల్హా (రజి) హజ్రత్ రసూలుల్లాహ్ (సొ) వారి వద్దకు వెళ్లారు. వారిలా చెప్పారు.

" రాత్రి నీవు అతిథికి చేసిన సత్కారం, అతని పట్ల ప్రవర్తించిన విధం అల్లాఃకు చాలా నచ్చింది. ఇప్పుడే ఆ సర్వాం

తర్యామి ఈ ప్రశంస పంపాడు. "అన్సారీలలో ఇలాంటివారి కూడా ఉన్నారు. తాము పస్తులుండి కూడా వచ్చిన అతిథులకి ప్రాధాన్యత నిచ్చి సత్కరిస్తారు." (హషర్)

ఈ ప్రశంస అబూతల్హా (రజి) కి ఎంతో ఆత సంతృప్తి నిచ్చింది.

# 4. మౌనమె నీ భాష

ప్రవక్త హజ్రత్ మహమ్మద్ (సా) వారి హదీ (వాక్కు) లో ఈ విధంగా చెప్పారు. ఐదుగురు వ్యక్తుల ప్రార్థనల అల్లాః వెంటనే ఆమోదిస్తాడు. ఎవడైనా దౌర్జన్యము చేస్తుంటే త భక్తుని మొరను దేవుడు ఆలకిస్తుంటాడు. ఆ దౌర్జన్యానికి ప్రతీకార చేసేందుకు సిద్ధపడినపుడు ఇక ఆ భక్తునిపై అల్లాః కెటువం బాధ్యత ఉండబోదు.

ఒక రోజు సంఘటన.

మహాప్రవక్త (సొ) సమక్షములో, వారి ముఖ్యఅనుచరు లలో ఒకరైన హజ్రత్ అబూబకర్ సిద్ధిక్ (రజి) ని ఎవరో తూల నాడుతూ ఉండినారు. అబూబకర్‌గారు మౌనంగా వింటున్నారు. ఆ సమయంలో ప్రవక్తగారి ముఖంలో మందహాసం తొణికిసలాడ్తూ ఉండింది.

తూలనాడడం ఎక్కువైంది. సహించలేకపోయారు అబూ బకర్. వారి వాదనకు ప్రతివాదనతో సమాధానం ఇవ్వసాగారు. మరుక్షణంలో ప్రవక్తగారి ముఖంలో మందహాసం మాయమైంది. కోపం చోటుచేసుకుంది.

పరిస్థితి సద్దుమణిగిన తర్వాత ప్రవక్తగారి మందహాసా నికీ, కోపానికీ కారణమడిగారు అబూబకర్. (రజి)

"అబూబకర్! మీరు ప్రతివాదనకు దిగకుండా ఏ నేరమూ వేయని మీరు మౌనంగా వింటున్నారు. అప్పుడు ఓ దేవదూత (ఫరిష్టా) అతనికి సమాధానం ఇస్తూ ఉండింది. ఎప్పుడైతే మీరు తూలనాడడానికి ఉపక్రమించారో ఆ దేవదూత మౌనం దాల్చింది. అది చూచి నాకు చాలా బాధ కలిగింది. నా మనస్సులోని బాధ ముఖంలో మీకలా కనిపించింది" అని మహాప్రవక్త చెప్పారు.

( అబూ దావూద్ )

# 5. న్యాయమంటే ఇదే

అమీరుల్ మోమినీన్ హజ్రత్ ఉమర్ (రజి) ప్రవక్త (సొ) అనుచరుల సభలో కూర్చొనియున్నారు. అనుచరులు, ఇతర పెద్దలు అక్కడే ఉన్నారు. అమీరుల్ మోమినీన్ ధర్మోపన్యాసం చేస్తున్నారు. అక్కడ చేరిన వారంతా ప్రశాంతంగా వారి వాగ మృతాన్ని గ్రోలుతున్నారు. ఇంతలో ఒక యువతి, ఒడిలో పసి బిడ్డతో వచ్చి సభకు సలాము చేసింది.

"ఎవరమ్మా నీవు? ఎందుకు వచ్చావు?" అని అడిగారు అమీరుల్ మోమినీన్.

"హజ్రత్‌గారూ! ఏం చెప్పేది? నా ఒడిలో నిద్ర పోతున్న ఈ శిశువు మీకు మనుమడౌతాడు" అన్నది.

"హజ్రత్ ఉమర్ ఆశ్చర్యంతో ఆమె వైపు చూశారు." ఆమె వణుకుతూంది. నోట్లో నుంచి మాటలు పెగిలి రావడం లేదు. అతి ప్రయత్నంమీద మాట్లాడుతుంది.

"అమ్మా! చెప్పదలచింది నిర్భయంగా చెప్పు. ఆ బిడ్డ నా మనుమడన్నావు. ఎలా నాకు మనుమడౌతాడు? ఎవరి పిల్లవాడు? వివరంగా చెప్పు తల్లీ నీకేమీ భయం లేదు" అన్నారు.

"బాబా! మీ కుమారుడు అబూషహామా పుత్రుడు"

"ఏమిటీ నాకు తెలియకుండా ఉన్నదే! ఇంతకీ యిది అక్రమ సంతానమా? సక్రమ సంతానమా?"

"బాబా! నా తప్పు లేదు. మీ కుమారుడి అకృత్యానికి ఫలితం ఈ సంతానం. నా యిష్టం లేకుండానే నన్ను మానభంగం చేశాడు"

"దేవుని సాక్షిగా విషయమేమిటో వివరించు తల్లీ! ఎప్పుడు, ఎక్కడ, ఎట్టి పరిస్థితుల్లో ఈ అకృత్యం జరిగింది?"

"నేను ఒక రోజు పనిమీద బనునజ్జార్ తోట ప్రక్కన పోతున్నాను. మీ కుమారుడు తప్ప త్రాగిన మైకంతో ఎదురొచ్చాడు. నన్ను పట్టుకున్నాడు. నేను పారిపోయేందుకు ప్రయత్నించాను. గింజుకున్నాను. వదలలేదు. బలాత్కారంగా నన్ను చెరిచాడు. స్పృహ వచ్చిన తర్వాత కుళ్ళికుళ్ళి ఏడ్చాను. ముంచుకొచ్చే సిగ్గు ఈ విషయం ఇతరులకు చెప్పకుండా నివారించింది.

నా మనక్షోభకు తోడు గర్భమొకటి దాపురించింది. ఇంట్లో చెప్పలేక, నిందలు మోస్తూ, క్రుంగిపోతూ పురుడు పోసుకున్నాను. ఆ దుర్భరమైన స్థితి పగవాడికి కూడా వద్దు. ఈ బాబు పుట్టాడు. పుట్టగానే వీడి గొంతు నులిమి చంపివేద్దామనిపించింది.

కానీ పిల్లవాడిపై, నా రక్తం పోసుక పుట్టిన బిడ్డపై ప్రేమ, దైవభీతి ఆ పాపానికి ఒడిగట్టకుండా చేశాయి. తమరు నలుగురికి న్యాయం చెప్పేవారు. న్యాయ పాలకులు. ఇస్లాం నిబంధనావళి ప్రకారము న్యాయం చెప్పండి" అని ఒక నిట్టూర్పు విడిచింది ఆ యువతి.

హజ్రత్‌గారి మనసులో అగ్నిగోళాలు పగులుతున్నాయి. ఉద్రేకం కలిగింది. ఆ నిస్సహాయురాలిపైన జాలి, తన కుమారునిపైన పిచ్చి కోపం కలిగాయి. ఏ భావాన్నీ బయట పడనీయకుండా, వేగంగా యింటికి వెళ్లారు. తలుపు తట్టారు.

లోపలి నుండి "ఎవరు మీరు?" అనే ప్రశ్న వినిపించింది.

"నేను అమీరుల్ మూమినీన్ ను. నా కుమారుడు అబూషహామా ఇంట్లో ఉన్నాడా?" అని అడిగారు.

"ఉన్నాడండీ! భోంచేస్తున్నాడు. రండి" అని బేగమ్ సాహెబా తలుపు తీసింది. అతని వాలకం చూచి భయపడింది.

కొడుకు దగ్గరకు వెళ్లారు. "నాయనా! తొందరగా భోం చెయ్యి. ఈ భూమిమీద ఇదే నీ ఆఖరి భోజనం. తొందరగా కానీయ్" అన్నారు.

అబూషహామాకు ఒణుకు ప్రారంభమైంది. భయాందోళనలు ముప్పిరి గొన్నాయి. మెతుకు చేయినుండి జారిపోయింది.

"అబూషహమా! నేను నీకేమౌతాను?" గద్దించారు హజ్రత్‌గారు.

"మీరు ముస్లిముల నాయకులు. నాకు తండ్రి" అని భయపడుతూ చెప్పాడు.

"నా మాట వినడం, విధేయుడై ఉండడం అవసరమా? కాదా?"

"చాలా అవసరం. మీ మాట జవదాటను."

అయితే నేను నిన్ను కొన్ని ప్రశ్నలడుగుతాను. నిజం చెప్పు. ఒకనాడు నువ్వు ఒక యూదుని ఇంట్లో అతిథిగా ఉన్నావు. అతడు నిన్ను బాగా తాగించి బయటకు పంపాడు. అంతలో బనీనజ్జార్ తోటవద్ద ఒక అమాయకురాలు తారసపడ్డది కదూ కన్నుగానని కామంతో నిర్దాక్షిణ్యంగా ఆమె మానాన్ని దోచుకున్నావు. నీవు చేసిన పాపానికి ఫలితంగా ఆ అర్భకురాలు పడరాని పాట్లు పడింది. ఒక బిడ్డకు తల్లి అయింది. ఇదంతా నిజమా? కాదా? చెప్పు." ఉద్రేకంగా అడిగారు.

"నాన్నగారూ! మీరు చెప్పిందంతా నిజమే. కాని క్షణికోద్రేకంతో నేను చేసిన పాపానికి కుళ్ళిపోయాను. క్షోభించాను పశ్చాత్తాపంతో కొమిలిపోయాను. దేవుని సన్నిధిలో రోజూ కన్నీళ్లు కారుస్తున్నాను"

అబూషహమా నేరం ఒప్పుకోవటమే తరువాయి హజ్రత్ !గారు కోపంతో ఊగిపోయారు. కొడుకు మెడపట్టుకొని సభావేదిక వైపు యీడ్చుకు పోయారు.

అబూషహమా ఏడుస్తూ "నాన్నగారూ! నాన్నగారూ! మీ కాళ్లు పట్టుకుంటాను. నన్ను నలుగురి ముందు పరాభవించవద్దు. నన్ను యింటిలోనే కొరడా వేయండి. అల్లాః కొరకు నన్ను అవమానించవద్దు" అన్నాడు.

"నేను నీ విన్నపం వినదల్చుకోలేదు. ఒకటి చెప్తాను విను. వ్యభిచారానికి శిక్ష అమలు సమయంలో ముస్లింలు కొందరు అక్కడుండడం అవసరమనీ, వారి సమక్షంలోనే శిక్షను అమలు పర్చాలని ఖురాన్ చెప్తుంది. అందుకు వ్యతిరేకంగా నిన్ను ఇంటిలో శిక్షించలేను." అని అంటూ సభాస్థానానికి తీసుకపోయారు.

తర్వాత తన బానిసయైన అఫ్లహా (రజి) ని పిలిచారు. "నా కుమారుడు అబూషహమా తన నేరాన్ని ఒప్పుకున్నాడు ఇతని వ్యభిచార నేరానికి నూరు కొరడా దెబ్బలు వెయ్యి."

బానిస అఫ్లహా "అబూషహమా గారిని కొరడాతో కొట్టడడం నావల్ల కాదు. నన్ను మన్నించండి." అని ప్రాధేయపడ్డాడు.

"అఫ్లహా! నా కుమారుడని వివక్షత చూపవద్దు. ఎలాగైతే ప్రవక్త యొక్క ఆజ్ఞను శిరసావహించవలసిన అవసరముందో అలాగే

నా ఆదేశాన్ని కూడా గౌరవించు. నేను ప్రవక్త ప్రతినిధిని. నేను చెప్తున్నాను. నీ విధ్యుక్తధర్మాన్ని నీవు నిర్వర్తించు.

ఇక చేసేదిలేక అఫ్లహా అబూషహమా దుస్తుల్ని తీశాడు. అబూషహమా రోదిస్తున్నాడు. అక్కడున్న వారందరికీ బాధగా ఉంది. అందరూ 'మీ కుమారుణ్ణి క్షమించి వదలి వేయండి" అని అంటున్నారు.

"మీరు నన్ను నివారించవద్దు. శిక్షను అమలు చేసే ప్పుడు కనికరం కూడదు. అఫ్లహా! నీ పని త్వరగా కానియ్యి.

అఫ్లహా కొరడాతో కొట్టడం ప్రారంభించాడు ఒక్కొక దెబ్బ అబూషహమా శరీరాన్ని చీల్చేస్తుంది. రక్తం స్రవించడం ప్రారంభించింది. దెబ్బ దెబ్బకు రక్తం కారుతూంది. క్రింద మడుగు కడ్తూంది.

దెబ్బలకు ఓర్చుకోలేక అల్లాడి పోతున్నాడు. కేకలు వేస్తున్నాడు. డెబ్బై కొరడా దెబ్బలు కొట్టేసరికి అఫ్లహా అలసి పోయాడు.

అబూషహమా పరిస్థితి దయనీయంగా తయారయిందిక ప్రజలు నిట్టూర్పులు విడుస్తున్నారు. దెబ్బల శబ్దం తప్ప స్మశాన ప్రశాంతత ఏర్పడింది.

అబూషహమాకు ఏడ్చి ఏడ్చి, అరిచి అరిచి నాలు

పిడచకట్టుక పోయింది. దప్పిక తీర్చుకొనేందుకు నీటికోసం విజ్ఞప్తి చేశాడు. కాని న్యాయానికి, ధర్మానికి కట్టుపడి ఉన్న అమీరుల్ మోమినీన్ "నాయనా! తొందరపడకు శిక్ష పూర్తవ్వనివ్వు. నీవు పవిత్రుడివి కానున్నావు. నీకు త్వరలో నేఇలాంటి కోనేరు నీరు త్రాగి స్తావు. ఇక ఎప్పుడు దాహంకాదు. ఇంక కొద్దిసేపు ఓర్పుతో ఉండు. రేపు నరకాగ్నిలో లెక్కలేనన్ని యేండ్లు బాధపడడం కంటే ఈ స్వల్ప శిక్షే మేలు నాయనా! అని అనునయంగా చెప్పారు.

ఎనభై కొరడాలు పూర్తయినాయి. అబూషహామా అవ సాన దశకు చేరుకున్నాడు. చాలా హీనస్వరంతో "వెళ్లొస్తాన్. శెల వివ్వండి నాన్నగారూ!" అంటూ నేలకొరిగారు.

"బాబూ! ఆ పరలోకంలో ఒకవేళ మహమ్మద్ ప్రవక్త గారు కనిపిస్తే వారికి నా సలాములు చెప్పు. మా నాన్నగారు ఖుర్ ఆనే పఠనం చేస్తూ, ఆ పవిత్ర గ్రంథ ఆదేశాన్ని ఆచరణలో పెట్టుండగా వదలి వచ్చానని చెప్పు" అని గంభీరంగా అన్నారు.

అఫ్లహ్ నూరయేంతవరకూ కొట్టుకుంటూ పోతున్నాడు. అబూషహామా కాళ్లూ, చేతులు పడిపోయాయి. కనుగుడ్లు తేలేశాడు అక్కడ చేరిన వారంతా అతడి పరిస్థితి చూచి "హజ్రత్‌గారూ! శిక్ష కొంతసేపు ఆపండి. దెబ్బలు తినే సత్తువ వచ్చాక కొట్టిం చండి" అంటున్నారు.

" సాధ్యంకాదు. నేరం చేసేప్పుడు ఇతడు ఆగలేదు. అట్లాగే కొరడా దెబ్బలు కూడా ఆపేందుకు వీలులేదు" అని కఠినంగా జవాబిచ్చారు

అబూషహామా తల్లికి ఈ వార్త తెలిసింది. ఆమె గుండెలు బాదుకుంటూ వచ్చింది "ఏమండీ! ఇక కొట్టకండి. నా బాబు తట్టుకోలేడు. క్షమించండి. ఆ దెబ్బలకు బదులుగా నేను వాహనము లేకుండా పదిపర్యాయాలు హజ్ చేస్తాను. దానాలు చేస్తాను" అని వేడుకుందా మాతృమూర్తి.

"హజ్ చేయడం, దానాలు చేయడం ఈ శిక్షకు బదులు కాజాలవు. వెంటనే వంద కొరడా దెబ్బలు పూర్తిచెయ్యి అఫ్లహా!" అని ఆజ్ఞాపించారు హజ్రెరత్‌గారు.

వంద కొరడా దెబ్బలు పూర్తయ్యాయి. అబూషహామా కుప్పకూలిపోయాడు. హజ్రెరత్‌గార్కి గాంభీర్యం సడలింది. శిక్ష అమలు జరిగిపోయింది. ఇక కాఠిన్యం అనవసరం. పితృహృదయం బద్దలయింది. దుఃఖం పెల్లుబికింది. విలపిస్తూ కుమారుడి తల ఒడిలో పెట్టుకొని "నాయనా! అల్లాః నిన్ను క్షమిస్తాడు. ధర్మ రక్షణ కోసం ప్రాణత్యాగం చేశావు బాబూ" అంటూ రోదిస్తున్నారు.

ఆ హృదయ విదారకమైన దృశ్యాన్ని చూడలేక కనులు మూసుకున్నారు ప్రజలు. వారి మనసుల్లో హజ్రెరత్‌గారు మహోన్నతంగా ఎదిగి ధర్మం విశ్వరూపం ధరించినట్లుగా కనిపించారు.

# 6. అధికార యాత్ర



ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి) సిరియాకు అధికార యాత్రకు బయలు దేరారు. అక్కడ అన్నీ తనిఖీచేసి, కార్యాలు ముగించుకొని వస్తున్నారు. త్రోవలో దూరాన గుడిసెలు కనిపించాయి. పట్టణానికి చాలాదూరంగా, యెడారిలా ఉన్న ఆ ప్రదేశంలోని గుడిసెలలోని వారి స్థితిగతులు కనుక్కుందామనుకున్నాడు. అక్కడకు వెళ్ళారు. పరివారాన్ని ఆపారు. ఖలీఫా ఒంటె దిగి ఒక గుడిసెవద్దకు వెళ్లారు.

ఆ గుడిసెలో ముంగిట ఒక ముసలిది తలమీద చెయ్యి పెట్టుకొని కూర్చొని ఉంది. ఆమె ముఖం ముడతలుపడి ఉన్నది. చాలా దీనంగా, దిగులుగా ఉంది. ఆమెను సమీపించి ఖలీఫా ఆమెకు నమస్కారం చేశారు.

"అవ్వా! నీకు ఉమర్ ఖలీఫాను గూర్చి ఏమైనా తెలుసా?" అని అడిగారు.

"ఉమర్‌ను గూర్చి తెలుసుకోవలసిన అక్కర నాకేంటి? నా విషయాలే చూసుకోవలసినవి చాలా ఉన్నాయి. అయినా విన్నాలే. సిరియాకు వెళ్లి, తిరిగి వస్తూ మదీనా వెళ్తాడటలే" అని చాలా నిరాశతో, కోపంతో అన్నది.

ఖలీఫా ఆలోచనలో పడిపోయారు. అతి నెమ్మదిగా "పెద్దమ్మా! ఖలీఫాను గూర్చి యింత విముఖంగా మాట్లాడతావేం? ఆయన మంచివాడుగా? అందరూ మెచ్చుకుంటారే. నువ్వెందుకు అంత అప్రియంగా, నిరాశగా మాట్లాడుతావు?" అని అడిగారు.

"ఏమయ్యా! నీకు ఉమర్ తోక పట్టుక తిరుగడంకంటే మరేం పనిలేదా? నాకు ఊహ తెలిసినప్పటి నుండీ ఎన్నో బాధలు పడుతూ, ఇలాగే జీవితం గడుపుతున్నాను. నా బీదతనం గమనించి నాకేమైనా పైకం పంపి సహాయం చేశారా? ఆ ఉమర్‌కు నాకు మధ్యనున్న వివాదం తీర్పు అక్కడ దేవుడి ముందు జరగదా? అప్పుడు చెప్పనా ఈ అన్యాయం గురించి?" అని పెద్ద గొంతుతో ఆక్రోశ వెళ్ల బుచ్చింది.

"పెద్దమ్మా! నీపరిస్థితి గురించి ఉమర్‌కు ఎప్పుడైనా చెప్పుకున్నావా?" అని అతివినయంగా ప్రశ్నించారు ఉమర్ (రజ్హి).

"మీరుకూడా బలే మాట్లాడుతున్నారే! నా పరిస్థితి నేను పోయి చెప్పుకోవాలా? తెలుసుకోవలసిన బాధ్యత ఆయనకు లేదా? నా గుడిసె ఆయన పరిపాలన పరిధిలో లేదా? ఇది ముస్లిమ్ రాజ్యంలోని ప్రదేశం కాదా? ప్రజల మంచిచెడ్డలు కనుక్కోవాల్సిన బాధ్యత ఖలీఫాకు లేదా?" అని చాలా ఆవేదనతో చెప్పింది.

"పెద్దమ్మా! ఎందుకింత కోపపడుతున్నావో నాకు అర్థం

కావడం లేదు. పట్టణానికి దూరంగా ఎడారిలో ఉంటున్నారు మీరు. మీ పరిస్థితులు ఖలీఫా కెలా తెలుస్తాయి? మీ పరిస్థితి తెలిసే సహాయం చేయకుంటే అతడు నేరస్తుడవుతాడు. కాని పరిస్థితి తెలిసే అవకాశమే లేదే'' అన్నారు ఖలీఫా.

''మీరు చాలా తెలివిగల వాళ్ళుగా కనిపిస్తున్నారు. కాని ఎంత తెలివి తక్కువగా మాట్లాడు తున్నారు? ఆ ఖలీఫాకు ఇంత దూరపు విషయాలు తెలియవంటున్నారు కదా! ప్రజల కష్టసుఖాలు తెలుసు కొనేందుకే కదా ఖలీఫా! మా పరిస్థితి తెలిసికోను వీలులేనప్పుడు మా ప్రదేశం ఆయన రాజ్యంలో ఎందుకుండాలి? ఆయన తెలుసుకునేందుకు వీలున్నంత పరిమితిలోనే రాజ్యముంటే మంచిది కదా! అని చాలా ధైర్యంగా పలికింది.

ఉన్నవాస్తవాన్ని కుండ బద్దలుకొట్టినట్లు చెప్పడం విన్నారు ఖలీఫా. 'రాజ్యకాంక్షతో' రాజ్య విస్తారంగాభిలాషతో జైత్రయాత్రలు చేసి, ఎందర్నో చంపి రాజ్యాలు జయిస్తాము కదా! వారి స్థితిగతులు కనుక్కోవలసిన అవసరంలేదా? అలా కనుక్కో లేకపోయినప్పుడు ఈ రాజ్యమెందుకు? రాజ పదవి ఎందుకు ఆలోచనలో మునిగారు ఖలీఫా.

పెద్దమ్మా! నీవు చెప్పింది వాస్తవమే'' అంటూ బాధతో బయలుదేరిపోయారు.

"ప్రజల స్థితిగతులు చూడగలిగేందుకు వీలున్నంతవరకే రాజ్యపరిమితి పెట్టుకోవాలి" అన్న ముసలమ్మ మాటలు పోయి నంతదూరం ఖలీఫా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. దారివెంట కంట నీరు పెడుతూ త్వరగా మదీనా చేరారు. ఆ ముసలామెకు, ఆ ప్రక్క గుడిసెలవారికి కావలసిన వస్తువులన్నీ పంపించారు.

"ప్రభూ! ఎటువంటి పొరపాట్లు జరగకుండా నా పరి పాలన జరిగేట్లు చూడు తండ్రీ!" అని అల్లాఃని ప్రార్థించారు ఖలీఫా.

---

# 7. ఒక బాటసారి

ఒకరోజు.

అమీరుల్ మోమినీన్ (ఖలీఫా) హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) భోజనం చేస్తున్నారు.

వారి ముందు విశాలమైన పళ్లెముంది అందులో ఆలివ్ నూనె ఉంది. ఇతర భోజ్య పదార్థాలున్నాయి.

ఆ సమయంలోనే మదీనా నగరం వెళ్తున్న బాటసారి ఒకడు వచ్చాడు. ఖలీఫాగారు అతణ్ణి పిలిచి ఆతిథ్యమిచ్చారు. ఆ పల్లెటూరి వాడు బాగా ఆకలితో ఉన్నాడు ఖలీఫా సరసన

కూర్చున్నారు. వడివడిగా రొట్టెముక్కలు పెద్ద పెద్దవి తుంచుకొని నూనెలో ముంచుకొని ఆబగా తింటున్నాడు. అది చూచే వాళ్లకు చాలా అనాగరికంగా ఉంది.

ఖలీఫా అతణ్ణి అలాగే చూచారు. అతడి పట్ల చాలా జాలి కలిగింది. "ఏమోయ్! మీ ఊళ్లోకూడా కరువు కాట కాలున్నాయా?"

అతడి కళ్ళు చెమ్మగిల్లాయి. "ఖలీఫాగారు ఊళ్ళో అందరం ఈ కరువు రోజుల్లో చాలా అవస్థలు పడుతున్నాం. కరువొచ్చినప్పటి నుంచి మా ఊళ్లో ఎవరూ నూనెకాని నెయ్యిగాని వాడినట్లు నేను చూడలేదు".

ఖలీఫా కళ్ళలో నీళ్లు నిలిచాయి. కొంతసేపు తలవంచుకొని నిశ్శబ్దంగా ఉండిపోయారు. ఒక దృఢనిశ్చయానికి వచ్చారు.

"నా రాజ్యంలో వర్షాలు కురిసి, పుష్కలంగా పంటలు పండే వరకూ నేనూ ఆహారంలో నెయ్యిగాని, నూనెగాని వాడను. ప్రజలకు కడుపునిండా తిండి పెట్టగలిగేంత వరకూ ఈ శపథాన్ని నిలబెట్టుకుంటాను".

ఇన్షా అల్లాః

# 3. వివాదము



అమీరుల్ మోమినీన్ హజ్రత్ అలీ (రజి) సఫ్ఫైన్ యుద్ధరంగానికి వెళ్తున్నారు. త్రోవలో తన కవచాన్ని పోగొట్టుకున్నారు ఎంత వెదికినా దొరకలేదు.

వారు తిరిగి వస్తున్నారు. ఒక యూదు జాతీయుడు కవచం ధరించి ఉండగా చూచారు. అది తనదేనని గుర్తించారు.

"ఓయీ! ఈ కవచం నాది. నేను దీనిని ఎవరికీ అమ్మనూలేదు, బహుకరించనూ లేదు. మరి నీకెలా లభించింది?"

కాని యూదుడు అది తన కవచమేనని వాదించాడు. తన సొత్తు గనకే తను ధరించానని నొక్కి నొక్కి పలికాడు.

హజ్రత్ అలీ గారు చేసేది లేక న్యాయాధికారి వద్దకు వెళ్ళుదాం రమ్మన్నారు. వారు న్యాయాధికారితో ఇలా అన్నారు.

"ఖాజీసాహెబ్! ఈ యూదుని వద్ద ఉన్న కవచం ముమ్మాటికి నాది. దానిని నేను ఎవరికీ అమ్మలేదు. బహూకరించ లేదు. మరి ఇతడికి ఎలా వచ్చిందో కనుక్కోండి".

ఖాజీ యూదుని వైపు ప్రశ్నార్థకంగా చూచారు.

"ఖాజీగారూ! ఇది నా కవచం. నా అధీనంలో ఉంది"

"ఖలీఫాగారూ! అతని వద్ద ఉండే కవచం తనదే నంటున్నాడతడు. మరి తమరు అది తమదంటున్నారు. తమదని నిరూపించుకునేందుకు సాక్షులెవరైనా ఉన్నారా? సెలవివ్వండి."

"లేకేం ఖాజీ సాహెబ్! నా కొడుకు, నా సేవకుడు సాక్ష్యం చెప్తారు".

ఖాజీ చిరునవ్వు నవ్వాడు! "ఖలీఫాగారూ! తండ్రి విషయంలో తనయుని సాక్ష్యం, యజమాని విషయంలో సేవకుని సాక్ష్యం చట్టరీత్యా ఆమోదయోగ్యం కావని తమకు తెలియదా? సాక్ష్యం లేనందున ఈ కవచం మీది కాదని ఋజువైంది. కాబట్టి ఇది యూదునకే చెందుతుంది" అని తీర్పు చెప్పారు.

ఆ యూదు జాతివాడు ఈ తీర్పు విని పులకించిపోయాడు. ఖలీఫాకే విరుద్ధంగా ఖాజీ తీర్పివ్వడం అపూర్వం. అతడు ఖలీఫా పాదాలకు మోకరిల్లాడు.

"ఖలీఫా! క్షమించండి. ఈ కవచం మీదే. ఇస్లాం మతంలో సత్యం, ధర్మం నాలుగు పాదాల మీద నడుస్తుందని తెలిసింది. నాకు జ్ఞానోదయమైంది. న్యాయం నిర్భయంగా మీ పరిపాలనలో రాజ్యం చేస్తుంది. నేను మీ ఇస్లాం మతాన్ని స్వీకరిస్తున్నాను".

)o(

# ౯. అపార్థం

ఖాజా హసన్ బస్రీ (రహ) దజలా మహానదీ తీరాన పోతున్నారు. అతడు గొప్ప సాధకుడు. పరిశుద్ధమైన నడవడిక, దైవభక్తి కలవాడు. నదీ తీరమైనందున గాలి తీవ్రంగా వీస్తుంది. నదిలో అలలు ఎక్కువగా వస్తున్నాయి.

ఆ నదీతీరాన ఒక దృశ్యం అతని కంట పడింది. ఒక యువకుడు నది ఒడ్డున యి సు క లో కూర్చొని ఉన్నాడు. అతని తొడలమీద ఒక స్త్రీ తలపెట్టి పడుకొని వుంది. ఒక కూజాతో ఆమెకు తాపిస్తున్నాడు. అమె తాగిన తర్వాత తాను కూడా తాగుతున్నాడు.

ఖాజా హసన్ బస్రీ (రహ) చూపులు, ఆ యువకుని చూపులు కలిశాయి. హసన్ బస్రీగారి (రహ) గారి ముఖంలో అసహ్య భావన తొంగి చూచింది. అలా చూచి ముఖం ప్రక్కకు తిప్పుకొని ముందుకు వెళ్ళిపోయారు.

ఖాజా సాహెబ్ కొద్దిదూరం ముందుకు వెళ్లారో లేదో ఇంతలో ఏదో పెద్దగోల నదిలో వినవచ్చింది. అటు తి రి గి చూచారు. ఆందోళన పడ్డారు. ఆవేదన చెందుతున్నారు.

నదిలో ఒక పడవ తలక్రిందులైంది. దానిలోని జనం సహాయం కోసం కేకలు పెడ్తున్నారు. నదిలో పడి ఈత రాక నీళ్లు త్రాగి గగ్గోలు పడిపోతున్నారు.

తీరంలో ఉన్న యువకుడు చూచాడు ఈ దృశ్యాన్ని. క్షణం కూడా ఆలస్యం చేయలేదు తన తొడపై నున్న స్త్రీ ని ప్రక్కకు నెట్టి క్రింద పడుకోబెట్టి పరుగుతీశాడు ఒక్క ఉదుటున నదిలో దూరికాడు ఈదుకుంటూ పడవను సమీపించాడు. మునిగే వారిని ఒక్కొక్కరినే పట్టుకొని ఒడ్డుకు చేరుస్తున్నాడు. అలసట కలుగుతున్న లెక్కచేయడం లేదు. మరలా నదిలోకి పోతున్నాడు. మరొకరిని తెస్తున్నాడు. ఇలా తొమ్మిదిమందిని ప్రాణాలకు తెగించి కాపాడాడు అలసి, సొలసి తూలుతున్నాడు. అయినా కార్యదీక్షతో ముందుకురుకుతున్నాడు,

హసన్ బస్రీ (రహ) నదీతీరానికి వచ్చారు. ఆ కుర్ర వాణ్ణి అతడి సాహసాన్ని చూచి నివ్వెరపోయారు. ఆ యువకుడు అతిప్రయాసతో హసన్ బస్రీగారి వద్దకు వెళ్లాడు. "ఏమండీ! పడవలో పదిమంది ఉన్నారు. నేను తొమ్మిదిమందిని రక్షించాను. ఇంకా పడవవాడు ప్రాణాల కోసం ప్రాకులాడుతూ అక్కడున్నా డు. అతడికి ఈత వచ్చును. కాని దెబ్బతిన్నందున ఈదలేకుండా ఉన్నాడు, తమరు ఆ ఒక్కణ్ణీ బయటకి తీసుకరాండి పుణ్యా ముంటుంది" అన్నాడా యువకుడు.

అవాక్కయారు హసన్ బస్రీ. ఏమీ మాట్లాడలేకపోతు న్నారు. "ఏమండీ! ఆక్కడ కూర్చొన్నామె నా తల్లి. ఆ మెను! తీసుకొని యింటికి వెళ్లుతున్నాను. ఆమె ఆరోగ్యం దెబ్బతిన్నది. నడవలేక శోషవచ్చి పడిపోయింది. నేను నదిలోని నీరు తీసుకొని వచ్చి ఆమెకు తాపించి, నేనూ తాగాను. కాని మీరు నన్ను. నా తొడపై పడుకున్న ఆమెను చూచి ఏమనుకున్నారో ఏమో! మీ ముఖాన నాపట్ల చాలా అసహ్యాభావం గోచరించింది. ఇతరుల మీద త్వరపడి ఒక అభిప్రాయానికి రాకూడదు" అన్నాడా యువకుడు.

ఈ మాటలకు హసన్ బస్రీ (రహ) పశ్చాత్తాపంతో కుంగిపోయారు. ఎంత అపార్థం చేసుకున్నాడు తాను! తల్లికి సేవ చేసేవాణ్ణి, ఇంతమంది ప్రాణాలు రక్షించినవాణ్ణి ఎంత నీచంగా భావించాడు తాను. ఇన్నేళ్ళ తన సాధన ఏమయింది? తన సంస్కా రం ఏమైంది?

ఇంతలో ఆ యువకుడు మరలా నదిలో కురికి ఆ పదవ వ్యక్తిని పట్టుకొని ఈదుకొంటూ ఒడ్డుకు వచ్చాడు.

అయ్యో! తనకు ఈతకూడా రాదే! తానెంత అసమర్థుడు ఆ యువకుడితో పోల్చుకుంటే తానెంత అల్పుడు! ప్రాణాలకు తెగించి పదిమంది ప్రాణాలు రక్షించిన ఆ త్యాగమూర్తిని లోలోనే అభినందిస్తూ విషయం తెలుసుకోకుండా ఇక ఎవరిని గూర్చి కూడా తప్పుగా అనుకోకూడదని నిర్ణయించుకున్నారు.

జరిగిన తప్పిదనానికి బాధపడుతూ, కుమిలిపోతూ దేవుని ప్రార్థించారు.

)o(

## 10. రాజ భోజనం

సర్వసంగ పరిత్యాగియైన ఒక సాధుసత్తముడు ఒక జరాధానిలో మకాం చేశాడు. ఆ దేశపు రాజు ఆ సాధువును దర్శించాలనుకున్నాడు. రకరకాలైన పిండివంటలతో, ఫలాలతో, షడ్రసోపేతమైన భోజనం తయారు చేయించి తనవెంట తీసుకొని సాధువు వద్దకు వెళ్ళాడు.

చాలా వినయంగా సాధువుకు నమస్కరించి, తాను తెచ్చిన భోజనం భుజించి తనను కృతార్థుణ్ణి చేయమని ప్రార్థించాడు రాజు. సాధువు ఆ అన్నంలో కొంచెం తీసుకొని ఉండను చేశాడు. ఆ అన్నపు ఉండను ఒక అద్దంపై పులిమాడు. అద్దం మురికితో నిండిపోయింది. మసకబారింది.

సాధువు తాను తినే ఎండిన రొట్టెను తెప్పించి, దానితో అద్దంపై రుద్దాడు. అద్దంపై మురికి పోయి శుభ్రమయింది.

"చూచావా! మహారాజా మీ భోజనం మకిలినిస్తుంది. నా భోజనం మకిలి పోగొట్టుతుంది. కాబట్టి నా భోజనం నన్ను తిననివ్వు నీవు తెచ్చిన భోజనమే తినమని బలవంత పెట్టవద్దు."

"అలాగే స్వామి! మీ భోజనమే తీసుకోండి. మీకు ఉపకరించే కార్యం ఏదైనా చేస్తాను. నేను ఏం సేవ చేయగలనో సెలవివ్వండి" అని వినయంగా అడిగాడు రాజు.

"మహారాజా! ఈగలు, దోమలు బాధిస్తున్నాయి. వాటిని అరికట్టండి ఆ సహాయం చేయండి చాలు" అన్నాడు సాధువు.

"స్వామి! ఈగలు, దోమలు నా ఆజ్ఞను పాటిస్తాయా? నేను బాధించవద్దంటే మానాయా? వాటిని అరికట్టడం సాధ్యమా?"

"మహారాజా! సృష్టిలో అతి చిన్నవైన ఈగలు, దోమలే నివారించలేనివారు నాకేమి సహాయం చేస్తారు? సర్వాంతర్యామియైన అల్లాఃను నమ్మినవాళ్లం. మాకేం లోటుంటుంది? మేము ఎవరిని ఏమి కోరవలసిన అక్కరలేదు. కావలసిందేమిటో ఆవిశ్వాత్మనికి తెలుసు. ఏది ఎప్పుడు అవసరమైతే అప్పుడు ఆ జగద్రక్షకుడు సమకూరుస్తుంటాడు. అయినా మాకేం కోరికలుంటాయి చెప్పండి" అని రాజు అల్పత్వాన్ని, ఏకేశ్వరుని విశ్వవ్యాపకత్వాన్ని వివరించాడు.

రాజుగారికి తన అల్పత్వం అవగతమైంది. అల్లాఃను ధ్యానిస్తూ, అహంకారముడిగి, మనసారా నమస్కరించి శెలవు తీసుకున్నాడు.

# 11 మనమెందుకు జన్మించాము?



పుణ్యపురుషుడైన హజ్రత్ బహెలూల్ (రహ) ఇలా చెప్తున్నారు—

"ఒక రోజు నేను బుస్రావీధుల్లో పోతున్నాను. దారిలో కొందరు పిల్లలు అక్రోట్, బాదంలతో ఆడుకుంటున్నారు. ఒక పిల్లవాడు వారిదగ్గరనుంచొని ఏడుస్తున్నాడు. బహుశా ఆ ఫలాలు తనవద్ద లేవని ఏడుస్తున్నాడేమోనని అనుకున్నాను. దగ్గరకు వెళ్లాను.

'నాయనా! ఎందుకు ఏడుస్తున్నావు?' నీకుకూడా అక్రోట్ బాదం ఇప్పిస్తాలే అని చెప్పాను.

ఆ పిల్లవాడు నా వైపు తిరిగి ఓ బుద్ధిహీనుడా! మనం ఆడుకుంటానికే పుట్టినామా" అని ఎదురు ప్రశ్న వేశాడు.

"బాబూ! అయితే మనం దేనికోసం పుట్టామునాయనా?" అని అడిగాను.

"విద్య నేర్చుకునేందుకు, దేవుని కొలుచుటకు సృష్టించబడ్డాము."

ఈ జవాబుకు నాకు చాలా ఆశ్చర్యం, ఆనందం కలిగాయి. బాబూ! ఆ దేవుడు నీకు దీర్ఘాయువు ప్రసాదించుగాక! నాయనా! ఈ మాటలు నీవు ఎక్కడ నేర్చుకున్నావు?" అని అడిగాను.

ఆ బాలుడు చెప్పుకుపోతున్నాడు, "చూడండి అల్లాః తన దివ్యవాణి (ఖుర్ ఆన్)లో ప్రశ్నిస్తున్నారు—మేము మిమ్మల్ని ఉద్దేశ రహితంగా సృష్టించామా? మీరు మా సన్నిధిలోకి తిరిగి రారా? దేవుని సన్నిధికి వెళ్లే సంకల్పముతోనే మీరు ఉన్నారా?"

ఈ మాటలు నాకు అమేయమైన ఆనందం కలిగించాయి. "నాయనా! నీవు విజ్ఞానంలో పరిపూర్ణుడివిగా కనబడుతున్నావు. నాకు కూడా ఉపదేశం ఇవ్వుబాబూ!" అని అడిగాను.

ఆ బాలుడు కవిత్వమందలి కొన్ని పంక్తులు ఉచ్ఛరించాడు. మరు నిమిషంలో స్పృహ కోల్పోయి పడిపోయాడు. నేను కంగారుపడి, అతని తల నా ఒళ్లో పెట్టుకుని, గుడ్డతో అతడి ముఖంమీద మట్టిని తుడిచాను. కొద్ది సేపటి తర్వాత అతడు స్పృహలోకి వచ్చాడు.

అప్పుడు నేను "బాబూ! ఈ వయసులోనే, ఇప్పుడే నీలో ఇంత భయము చోటు చేసుకున్నదేం? నీవు ఇంకా పసివాడివి. ఎందుకు అంత భయపడుతున్నావు?" అని అడిగాను.

ఆ బాలుడు చెప్పాడు. "మీరు తప్పుకోండి. నేను మా తల్లిని గమనించాను. ఆమె పొయ్యి రాజేసినప్పుడల్లా ముందుగా చిదుగులు పొయ్యిలో పడవేసేది. అవి బాగా రాజుకున్న తర్వాత పెద్ద పెద్ద కట్టెలు వేసేది. నాకు భయంగా ఉంది. నరకాగ్నిలో చిదుగులకు బదులుగా నన్ను వేస్తారేమోనని"

ఈ మాటలకు నేను నివ్వెర పోయాను. "నాయనా నీవు అల్లాః దయవలన చాలా తెలిసిన వాడివిగా ఉన్నావు. నాకింకా ఏదైనా హితవు చెప్పు" అని అడిగాను.

అతడు ఏదో పద్యము నుండి పద్నాలుగు సూక్తులు (*Verses*) చదివినాడు.

వాటి అర్థము ఇది—

"నేను పరధ్యానంగానే ఉండిపోయాను. మృత్యువును నా వెనుక తోలుకొచ్చేవాడు తోలుకునే వచ్చాడు. ఈ రోజు నేను వెళ్లకపోతే, రేపైనా తప్పక వెళ్లిపోతాను. ఈ నా శ రీ రా న్ని విలువైన వస్త్రాలతో అలంకరించాను. కాని ఈ శరీరానికి సమాధి లోతులలో కుళ్ళి కృశించి పోవడంకంటే ఇంకేముంది? ఆ దృశ్యం నేడు నాకళ్ల ఎదుటే ఉంది. నేను నాసమాధిలో చిలికి పడిఉండగా నాపై టన్నుల కొద్దీ మన్ను దిబ్బగా ఏర్పడింది. నా యీ అందచందాలు సమాధి గోతిలో నమసి పోతాయి. ఎముకలపై

చర్మంగాని మాంసంగాని మిగిలి ఉండవు. నేను సంపూర్ణంగా చెరిగి పోతాను.

నేను చూస్తున్నాను. నా ఆయువు తరిగి పోతూంది. కాని కోరికలు పెరుగుతున్నాయి. ప్రయాణం చాలా దూరం-కాని దారి ఖర్చులకు నావద్ద ఏమి లేదు. నా రక్షకుడు, పోషకుడైన అల్లాఃను పాప ప్రవృత్తితో ఎదుర్కొన్నాను. చాలా చెడ్డ పనులు చేశాను. వాటిని ఇప్పుడు ఉపసంహరించుకోవడం దుర్లభము, అసంభవము. నేను చేసిన నేరాలు ప్రజలకు తెలియకుండా అచ్ఛాదన వేశాను. కాని నా యజమాని కొలువులో తీర్పు దినమున ఇవన్నీ ప్రదర్శింప బడతాయి.

నా మనసులో అల్లాః అంటే భయముంది. కాని అల్లాః కరుణా కలిత ప్రవృత్తిని తెలుసుకొని పాపములకు పాల్పడ్డాను. అతనిపై నమ్మకం కూడా ఉంది. మా నేరాలన్ని అతడు తప్ప ఎవరు క్షమించగలరు..?

మానవుని శరీరం కుళ్లి కృశిస్తుందని ముందుగానే గ్రహిస్తే ఆటపాటలతో ఏ మానవుడు కాలం గడుపుతాడు? కాని మన బుద్ధి, జ్ఞానం నశించి, తప్పుత్రోవలు తొక్కుతున్నాము. పాపాల్ని క్షమించే ఆ దయామయుడే నా నేరాల్ని మన్నించాలి.

సేవకులవల్ల దొర్లిన నేరాల్ని, పాపాల్ని యజమానే

క్షమిస్తాడు. నిజంగా నేను దొంగ సేవకుణ్ణి. నా యజమానిపై అపచారం తలపెట్టాను. దుర్మార్గులు, తుచ్ఛులైన సేవకులందరూ నాలాగే ఉంటారు. నా శరీరాన్ని నరకాగ్ని దహించినప్పుడు నా పరిస్థితి ఏమిటి?

నేను చచ్చేటప్పుడు ఒంటరిగానే ఉండిపోతాను. సమాధిలోకూడా ఒక్కణ్ణే ప్రవేశిస్తాను. రేపు సమాధి నుండికూడా ఒక్కణ్ణే లేచి నిలబడతాను. నన్ను ఆదుకునేవారుగాని, సహాయపడే వారుగాని ఉండరు. ఓ దేవదేవా! కరుణా సింధో! ఒంటరిగా మిగిలిపోయిన నన్ను కరుణించు! రక్షించు!"

ఈ పద్య భావము విని నేను తీవ్రంగా ప్రభావితుడనైనాను తీవ్రమైన బాధ నన్ను చుట్టుముట్టింది. అది కేవలం ఆ బాలుని వేదన కాదు. ప్రతి జీవుని వేదన. నా వేదనకూడా! వేదన తీవ్రమై స్పృహ కోల్పోయాను. నాకు స్పృహ వచ్చేసరికి ఆ బాలుడు అక్కడ లేడు. అతడికోసం వెతికాను. అక్కడ ఆడుకునే పిల్లల్ని ఆ బాలుణ్ణిగూర్చి అడిగాను.

"ఏమండీ! మీకు ఆ అబ్బాయి ఎవరో తెలియదా? అతడు ప్రవక్త (సొ) మనుమడు. హజ్రత్ ఇమాం హసన్ (రజి) గారి కుమారుడు–జైనుల్ ఆబిదీన్ (రజి)" అన్నారు.

అప్పుడను కున్నాను. "ఆ దైవ చింతన, తత్వజ్ఞానం తరతరాల ఆస్తి. ఆ ఆస్తిని ఆ పుణ్యపురుషులు పదిలంగా కాపాడు కుంటున్నారు. వారు జీవన్ముక్తులు. వారి జన్మ సార్థకమైంది."



# 2. దైవాజ్ఞ



ఆమె అందాల భరిణ!

అపరంజి మొలక, కమనీయ రూప, కాంచన దేహ. ఆమె భర్త కురూపి, అందవిహీనుడే కాదు అష్టావక్రుడు కాని వారిద్దరూ అత్యంత అన్యోన్యంగా ఉన్నారు అనురాగంతో, అమర ప్రేమతో రాజిల్లు తున్నారు.

ఇమాం అస్మయి (రహె) అనే ఒక మహాపురుషుడు వారిద్దరినీ చూచి ఆశ్చర్యపోయారు.

కాకి ముక్కుకు దొండపండులాగా ఉన్నది. ఉండ బట్టలేక ఆ అమ్మాయితోనే అనేసారు.

"ఓ అమ్మాయీ! నీ వంటి సౌందర్యవతి ఈ కురూపితో ఎలా సంసారం చేస్తున్నావు! నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది సుమా!"

ఆ అందాలరాశికి ఇమాంగారి వైఖరి నచ్చలేదు. నొసలు చిట్లించింది. కోపంతో "ఏమండీ! పెద్దలు మీరు అలా మాట్లాడ తచ్చునా? మీ మాటలు నన్ను పెడత్రోవ పట్టించ వచ్చుగదా! నా భర్త పోషణ కర్తయైన అల్లాఃను ప్రసన్నుణ్ణి గావించుకునేందుకు ఏ మంచి పని చేశారో! అతని సత్కార్యాలకు మెచ్చి, ప్రసన్నుడై నా వంటి అందగత్తెను అతనికి భార్యగా చేసినాడేమో! లేక నా దుష్కర్మలకు కోపగించి, శిక్షా రూపంలో ఇటువంటి కురూపిని భర్తగా ఒసగినాడేమో! ఎవరికి తెలుసు? ఇది దైవాజ్ఞగా భావిస్తు న్నాను. మానవ జన్మ, ఈ జీవితం దేవుని వరాలు. నా ప్రభు వుకు ఇష్టమైన ఈ దాంపత్యాన్ని నేనెందుకు భక్తితో స్వీకరించ కూడదు? దైవ నిర్ణయాన్ని మహా ప్రసాదంగా స్వీకరించాము. అందుచేత మేము అన్యోన్య అనురాగంతో మసలు తుంటాము" అని వివరించింది.

ఆమె జీవన వ్యాఖ్యకు అచ్చెరువందారు అస్మయిగారు.

# ౨౯. సరైన దృష్టాంతం



ప్రయాణానికి సరంజామా అంత సర్దుకున్నారు హజ్రత్ షఫీక్ బల్ఖీ (రహ) దూర ప్రయాణం. ఎంతకాలం పడుతుందో తెలియదు. ఇక్కడి సరుకు తీసుకపోవాలి. అనేక ఊళ్లలో అమ్మాలి. అక్కడి సరకులు తీసుకరావాలి. ఈ వ్యాపారం ఎప్పుడూ చేస్తున్నదే. ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు అయిన తర్వాత మిత్రుడైన ఇబ్రాహీమ్ అద్హం అనే మిత్రుణ్ణి కలుసుకునేందుకు బయలుదేరారు. 'మళ్లా ఎప్పుడు కలుసుకుంటామో!' అని అనుకుంటూ వెళ్లారు. మిత్రుణ్ణి చూచి, పలకరించి వెళ్లి పోయారు.

కొద్ది రోజులే గడిచాయి. ఇబ్రాహీమ్ అద్హం (రహ) మసీదుకు వెళ్లారు. షఫీక్ బల్ఖీని అక్కడ చూచి ఆశ్చర్యపోయారు.

"వ్యాపారం కోసం వెళ్లిన వాడివి. అప్పుడే ఎలా రాగలిగావు?" అని అడిగారు.

"ఏం చెప్పేది మిత్రమా? నాప్రయాణంలో ఒక విచిత్రమైన దృశ్యం చూచాను. చూచి మనసు మార్చుకొని తిరిగి వచ్చేశాను".

"వ్యాపారం కూడా మానుకొని నిన్ను తిరిగి రప్పించిన ఆ దృశ్యం ఏమిటోయ్?"

"అదే చెప్తున్నాను. నేను ఎడారిలో పోతున్నాను. అలసట తీర్చుకొనేందుకు ఒక చోట ఆగాను. అక్కడ ఒక పక్షిని చూచాను. దానికి రెక్కలు లేవు. గుడ్డిది. నిస్సహాయంగా పడి ఉండింది. 'అల్లాః! ఈ దిక్కులేని పక్షికి జీవితం ఎలా గడుస్తుంది? ఆహారం ఎలా సంపాదించుకుంటుంది?' అని అనుకుంటున్నాను.

ఇంతలో మరో పక్షి ఎగురుతూ వచ్చింది. ముక్కుతో ఏదో ఆహారం తెచ్చింది. మెల్లగా ఆ గుడ్డి పక్షి వద్దకు వచ్చింది. దాని ముక్కులో తాను తెచ్చిన ఆహారాన్ని పడవేసింది. మళ్లా ఎగిరి పోయింది ఇలా వెళ్ళి అలా మళ్లీ ఆహారం పట్టుకొచ్చింది. ఆ దిక్కులేని పక్షి కడుపు నిండేంతవరకు ఆహారాన్ని తెచ్చి పెట్టింది. ఆహారం తిని గుడ్డి పక్షి నిశ్చితంగా ఉన్నది.

అప్పుడు నాకు అల్లాః అపార కరుణా విలాసంపై దృష్టి పోయింది 'ఈ ఎడారిలో, రెక్కలులేక, గుడ్డిగా పడున్న ఆ దిక్కులేని పక్షికి కూడా ఆహారం కూర్చిన ఆ కరుణా సాగరుడు మనకు మాత్రం ఆహారం కూర్చడా? పొట్టకూటి కోసం పడరాని పాట్లు పడుతూ, కానరాని దేశాలు తిరుగుతూ అష్టకష్టాలు పడాల్సిన అవసరమేమిటి?' అని ఆలోచించి ఆ దయామయుడైన ఆపద్బాంధవునిపై అచంచల విశ్వాసంతో తిరిగి వచ్చేశాను" అని చెప్పారు షఫీక్ బల్ఖి (రహ).

అతడు చెప్పిందంతా విని ఒక చిరునవ్వు నవ్వారు. ఇబ్రాహీమ్ అద్ధం (రహ). ఓరి పిచ్చివాడా! ఆ నిస్సహాయురాలైన పక్షినే ఎందుకు ఆదర్శంగా తీసుకోవాలి? దానికి కళ్ళు లేవు. రెక్కలు లేవు. ఇతరులపై ఆధార పడక తప్పదు. దానిలాగా నీ జీవితమూ ఇతరులపై ఆధార పడాలనుకుంటున్నావా? నీ కేమి? దేవుడు కాళ్ళిచ్చాడు, చేతులిచ్చాడు. ఆ రెండవ పక్షిని ఆదర్శంగా ఎందుకు తీసుకోకూడదు? దాని జీవితమెంత సార్థకమైనది! తాను తింటుంది. మరో దిక్కులేని పక్షికి సహాయం చేస్తుంది.

ప్రతివాడి జీవితం ఆ రెండవ పక్షిలాగా గడపాలి. తానింత తినాలి. ఇతరులకు కింత పెట్టాలి. అందుకు నిరంతరం పరిశ్రమించాలి. అప్పుడే జీవితానికి సార్థకత. నీవు మరచిపోయావా? క్రింది చెయ్యికంటె కూడా పైచెయ్యి చాలా ఉన్నతమైంది.

షఫీక్ (రహ) ఈ మాటల్ని వినటంతోటే మిత్రుడు చేతిని ముద్దు పెట్టుకున్నారు. "మిత్రమా! నీవు నా కళ్ళు తెరిపించావు" అని చెప్పి వెళ్ళిపోయారు. వెంటనే వ్యాపారం చేసేందుకు ప్రయాణానికి సిద్ధపడ్డారు.

(అన్వారే నిజమయా)

# 14. దైవ నిర్ణయం



రాజుగారికి జబ్బు వేసింది. ఎన్నో మందులు వాడారు రాజ వైద్యులు శతవిధాల ప్రయత్నిస్తున్నారు తెలిసిన వైద్యమల్లా చేశారు. కాని ఫలితం శూన్యం. రోజు రోజుకూ కృశిస్తున్నాడు. బ్రతుకుతాడనే నమ్మకం సన్నగిల్లింది. అందరూ ఆశ వదులుకున్నారు.

ఒక సాధువు దేశ దేశాలన్నీ తిరుగుతూ ఈ రాజ్యానికి వచ్చాడు. రాజు జబ్బుతో ఉన్నాడని తెలిసి చూచేందుకు వెళ్లాడు. పరీక్షించి "పన్నెండు, పదమూడు సంవత్సరాల కుర్రవాడి వెన్నుపూసలోని ఒక పూస తీసి రాజుగారి మెడలో వేస్తే రాజు బ్రతుకుతాడ"ని చెప్పి వెళ్ళిపోయాడు.

అటువంటి బాలుడి కోసం వెదకసాగారు. భటులు తిరిగి తిరిగి ఒక పేదరైతు బిడ్డను చూచారు. ఆ పిల్లవాడి తండ్రివద్దకు వెళ్ళారు. అతడికి చాలా మంది బిడ్డలున్నారు. దారిద్ర్యం పీడిస్తుంది. రాజు గారిచ్చే డబ్బుకు ఆశపడి కుర్రవాణ్ణి ఇచ్చేందుకు సిద్ధపడ్డాడు.

రైతుకు పైకమిచ్చి కుర్రవాణ్ణి రాజు వద్దకు తీసుకవెళ్లారు భటులు. ముక్కుపచ్చలారని పసివాణ్ణి చూచాడు. ఒక ప్రాణంతో

నా ప్రాణం కాపాడుకోవడం నాకిష్టంలేదు' అన్నాడు రాజు. ప్రక్కనే ఉన్నాడు కాజీ (న్యాయాధికారి).

అతడన్నాడు "దేశ ప్రజలందరినీ కాపాడేవాడు రాజు. అటువంటి రాజుగారి ప్రాణాలు కాపాడేందుకు ఒక అల్పప్రాణి ప్రాణం తీయడం పాపమేమి కాదు". ఈ మాటలు విని రాజు వాడి ప్రాణం తీసేందుకు ఒప్పుకున్నాడు.

ఆ కుర్రవాణ్ణి వధ్యశిల వద్దకు తెచ్చారు. పరివార సమేతంగా రాజు కూడా అక్కడికి వచ్చాడు. అందరూ చూస్తున్నారు. తలారి పిల్లవాడి మెడనరికేందుకు కత్తి నెత్తాడు. పిల్లవాడు ఆకాశం వైపుచూచి నవ్వసాగాడు. అతడి నవ్వు చూచి అందరూ దిగ్భ్రమ చెందారు.

'ఇదేమిటి? ప్రాణాలు తీయబోతుంటే ఏడ్వవలసిందిపోయి నవ్వుతాడేమిటి? ప్రాణ భయంతో గిలగిల కొట్టుకోవల్సిందిపోయి ఏమీ కానట్లు అమాయకంగా ఆ నవ్వేమిటి?' అనుకున్నారు.

అందరూ ప్రశ్నార్థకంగా చూస్తున్నారు.

రాజు తలారిని ఆగమన్నాడు. పిల్లవాణ్ణి పిలిచాడు. 'ఎందుకు నవ్వుతున్నావు నీవు?, అని అనునయంగా అడిగాడు.

అదురు బెదురు లేకుండా తొణక్కుండా నిలబడ్డాడు ఆ పిల్లవాడు. ధైర్యంగా సమాధానం చెప్పాడు.

"నవ్వక ఏం చేయమంటావు మహారాజా! పెంచి, పోషించి, అడుగడుగునా ఆదుకుంటూ, జీవితాన్ని దిద్దితీర్చవలసిన తండ్రే డబ్బుకాసించి కన్నకొడుకును కాటికంప సిద్ధపడ్డాడు. రాజ్యములోని ప్రజల క్షేమమే తన క్షేమముగా భావించవలసిన రాజే. రక్షించ వలసిన రాజే తన ప్రాణరక్షణ కోసం నా ప్రాణం తీయసిద్ధపడ్డాడు.

ఇక తన న్యాయదండంతో ప్రజలకు న్యాయంచేసి రక్షించ వలసిన న్యాయమూర్తే 'రాజు కోసం మరొకరి ప్రాణం తీసినా ఫరవా లేద"ని తీర్పిచ్చాడు. కంచే చేను మేస్తుంది. రక్షించ వలసినవారే భక్షింప చూస్తున్నారు. ఇక మిగిలిన రక్షకుడు ఆ జగద్రక్షకుడే. ఆయన అందరికంటే ఘనుడు. ఆయన తీర్పెలాగుంటుందోనని నవ్వు వచ్చింది నవ్వాను మహారాజా." అన్నాడు.

రాజుకు తన తప్పు తెలిసివచ్చింది. "నేను జబ్బు తో మరణిస్తే మరణించవచ్చుగాక! ఒక నిరపరాధిని నిలువునా చంపి, ఆ వెన్నుపూస నేను వేసుకొని నా ప్రాణాలు కాపాడుకోవడం ఘోర పాపం. ఆ పిల్లవాణ్ణి వదలండి" అని ఆజ్ఞాపించాడు.

దైవవశాత్తూ రాజుగారికి జబ్బు నెమ్మతించింది.

(మస్నవీ మౌలానారూమీ)

# 15. శాశ్వత నివాసం



హారుదుర్ రషీద్‌కు కొత్తకొత్త భవనాలు నిర్మించడమంటే మహాయిష్టం. అనేక సుందర భవనాలు నిర్మించాడు బాగ్దాద్ నగరాన్ని అందంగా తీర్చిదిద్దాడు. 182 హిజ్రీలో బాగ్దాద్‌లో ఒక దివ్య భవనం నిర్మించాడు. దానిలో దాదాపు వంద గదులున్నాయి ఆ గదుల్లో మంచి శిల్ప కళాభరితమైన వస్తుజాలాన్నంత సమకూర్చాడు అన్ని గదుల్నీ శోభాయమానంగా తీర్చిదిద్దాడు.

ఖలీఫా ఆ భవనాన్ని చూడడానికి వెళ్తున్నారు. తనవెంట పేరు ప్రఖ్యాతులు గల మహాపండితుడు హజ్రత్ ఫజల్ బిన్ రబీని కూడా వెంట తీసుకవెళ్లాడు.

ఇద్దరూ కలిసి భవనాన్ని సందర్శిస్తున్నారు. ఖలీఫా తన భవనాన్ని తానే పొగుడుకుంటున్నారు. "ఇది భవనం కాదు. దివి నుండి భువికి దింపిన స్వర్గం. భూతల స్వర్గం" అన్నాడు ఖలీఫా, ఏమీ పలకలేదు హజ్రత్ ఫజల్. భవనాన్ని చూచి, ఖలీఫాను అక్కడే వదలి వెళ్లిపోయారు. మళ్లీవచ్చి అ భవనంముందు తోటలో ఒకమూల గోరీ త్రవ్వించి వెళ్లిపోయారు.

మరుసటిరోజు ఖలీఫాను సందర్శించేందుకు ఆ భవనం

వద్దకే వచ్చారు హజ్రత్ ఫజల్. ఇద్దరూ భవనంచూస్తు, మాట్లాడుకుంటూ తోటలోకి వచ్చారు. మెల్లగా ఫజల్ ఖలీఫాను తాను త్రవ్వించిన గోరీవైపు తీసుకవెళ్లారు!

ఖలీఫాను దాన్ని చూచి "ఈ గుంట ఎవరు త్రవ్వారు?" అని అడిగారు.

"ప్రభూ ! ఇది గుంటకాదు గోరీ. ప్రతి మానవుడికీ శాశ్వత నివాసమిదే. రాజుకిగాని గర్భ దరిద్రుడికిగాని ఇంతకంటే ఎక్కువ భూమి వ్రాసి పెట్టలేదు. భూతల స్వర్గాన్ని నిర్మించే ప్రభువుకైనా ఇంతకంటే ఎక్కువ భూమి లభించదు. ప్రపంచంలోని అతి వైభవోపేతమైన భవనాలలో నివసించేవారు కూడా అక్కడ నివసించేది కొద్ది సంవత్సరాలే. ఆ తర్వాత అతని శాశ్వత నివాసం ఈ రెండు గజాలు భూమి మాత్రమే. ఈ గోరీలో వుండి తీర్పుదినం కోసం వేచివుండాలి.

కాబట్టి ప్రభూ! ఇటువంటి దివ్యభవనాలు నిర్మించి, కొన్నాళ్లుండి వదలిపోవడం కంటె వెంటవచ్చే కీర్తి ధనాన్ని సంపాదించండి. పోయేనాడు వెంబడిరాదు పూచికపుల్లయినా. పదుగురికి పెట్టిన సొమ్మే పుట్టినవాడు గిట్టినా తోడుంటుంది" అన్నారు.

ఈ మాటలు ఖలీఫా మనసులో నాటుకున్నాయి. కంట నీరు పెడ్తూ శేషజీవితాన్ని పుణ్యకార్యాల్లో వెచ్చించాలనుకున్నారు.

—oo§oo—

# ౧౩. చెప్పే తీరు-దాని ప్రభావం

ఒకతను ఇబ్రహీం అద్హం (రహ) వద్దకు వచ్చాడు. తన గోడు విన్నవించుకున్నాడు.

"ఓ భక్తాగ్రేసరా! నేను చేసిన పాపాలనుండి నాకు విముక్తి ఎలా కలుగుతుందో చెప్పండి?" అని అడిగాడతడు.

ఇబ్రహీం అద్హం (రహ) అతడి పాపకార్యాలను నిందించ లేదు. ఒకే పర్యాయం ఆ పాపకార్యాలను వదలివేయమని చెప్ప లేదు అతనితో "నీవు చేయదలచింది, చెయ్యి. కాని నేను చెప్పే ఈ మాటలు మాత్రం గుర్తుంచుకో. నేను చెప్పే మాటలు పాటిస్తే నీకు శాంతి కలుగుతుంది".

"సెలవీయండి మహానుభావా! ఆ మానసిక శాంతికోసమే మీ వద్దకు వచ్చింది".

ఇబ్రహీం అద్హం (రహ) "ఎప్పుడైనా నీవు పాపం చేయ దలిస్తే అల్లాః ఒసగిన ఆహారాన్ని భుజించవద్దు" అని చెప్పారు.

"ఆహారం యిచ్చేవాడు అల్లాః కదా! ఆయన యిచ్చే ఆహారం కాక నాకు ఇక ఎక్కడ ఆహారం దొరుకుతుంది? ఆ తిండి లేకపోతే ఆకలితో మాడి చస్తాను" అన్నాడతడు.

"అయ్యా! ఇది ఎలా పొసగుతుంది? అల్లాః ఆహారం తింటూ, అతని యిష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నావ్. సరే. ఇక రెండవ మాట. నీవు ఎప్పుడైనా పాపం చేయదలిస్తే చెయ్యి. కాని, దేవుని భూభాగాన్ని వదలివేసి మరెక్కడైనా చెయ్యి".

అప్పుడతడు "ఏమండీ! తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం క్రిందా పైనా భూమ్యాకాశపర్యంతం ఆ అల్లాః ప్రదేశమే కదా! ఈ ప్రదేశాన్ని వదలి నేను ఇంకెక్కడ చేయాలి పాపం మీరే చెప్పండి?"

"ఏమయ్యా! చాలా విచిత్రంగా చెప్తున్నావే. దేవుని ఆహారం వదలలేవు. దేవుని భూభాగం నుండి బయటకు పోలేవు. దేవుని ఇష్టానుసారం నడువలేవు. ఎలాగయ్యా నీతో? సరే. ఇక మూడో విషయం విను. నీవు ఎటువంటి పాపమన్నా చెయ్యి. దేవుని దృష్టి మాత్రం పడకుండా చెయ్యి."

"ఏమిటి స్వామీ. యిలా చెప్తున్నారు? అదెలా కుదురుతుంది? బయటే కాదు. మన మనసుల్లోకూడా ఏం జరుగుతుందో అతడికి తెలుసు. వర్తమానమే కాదు. భవిష్యత్తు కూడా తెలుసు ఆ అల్లాః అతడి దృష్టిని తప్పించుకోవటం ఎవరికి సాధ్యం?"

ఇబ్రహీం అద్ధం (రహ) "ఎలాగయ్యా నీతో? నీ మాటలు నాకేమీ అర్థం కావడం లేదు. దేవుడిచ్చిన ఆహారం తింటూ,

దేవుని దేశంలో ఉంటూ, దేవుడు చెప్పింది చేయకుండా, అదీ కూడా అతని ఎదుటనే అతన్ని వ్యతిరేకిస్తూ పాపాలు చేస్తావా? ఇది ఎంత వరకూ సమంజసం? సరే. ఈ మూడు చేయలేనంటు న్నావు. ఇంకొకటి చెప్తాను చెయ్యి. యమధర్మరాజు వచ్చి ప్రాణాలు తీసుక పోబోయేప్పుడు "చేసిన తప్పులకు ప్రాయచిత్తం చేసుకొని వస్తాను. కొస్త సమయం ఆగండి" అని చెప్పు అన్నారు.

"ఏమిటి గు రూ జీ! మీరు చెప్పే విషయాలు ఎవరూ పాటించలేరు. నేనే కాదు మరెవరూ చేయలేరు. యముడు నాకు సమయమిస్తాడా? ఎవరికన్నా వ్యవధి ఇచ్చి ఉన్నాడా. ఒక్క క్షణం కూడా ఆ గ డ త డు. ఏదైనా నేను చేయగలిగింది చెప్పండి. పాపాల్నుండి విముక్తుణ్ణి కాగలుగుతాను "

"చాలా చింతించాల్సిన విషయమే ఇది. యముడునుండి కాస్త వ్యవధిని కూడా పొందలేవా? ఆ మాత్రం శక్తికూడా లేదా? పోనీ యిప్పుడు నీకు సమయముంది గదా? దీన్నెందుకు సద్వినియోగం చేసుకోకూడదు? సరే ఈ విన్నపమైనా చెయ్యి! నీవు గోరీలో ఉన్నపుడు మున్కిర్, నకీర్ (యమకింకరులు) లు వచ్చి ప్రశ్నలు వేస్తే నీవు వారిని దగ్గరకుకూడా రానివ్వద్దు".

"ఓ భక్త శిఖామణీ! ఇది కూడ అసంభవమే. మున్కిర్ నకీర్లపైన నా అధికారమెలా చెల్లుతుంది స్వామీ? వారిని

రావద్దంటే రాకుండా పోతారా? ప్రశ్నలు వేయకుండా పోతారా?

"ఏమయ్యా! ఇదికూడా చేతకాకపోతే ఆ మున్‌కిర్ నకీర్‌లు వచ్చినపుడు వాళ్ళకివ్వవలసిన సమాధానాలన్నా తయారు చేసిపెట్టుకో వాళ్లముందు సిగ్గుపడవలసిన అవసరం లేకుండా చూచుకో. ఇదీ చేయలేకుంటే తీర్పు దినంలో దేవుడు పాపాలు చేసినవారిని నర కానికి పంపే ఏర్పాటు చేసేప్పుడు నీవు నరకానికి పోనని గట్టిగ చెప్పేసెయ్"

"స్వామీ! నేను పోనంటే మానుతారా? బలవంతంగా తీసుకవెళ్లి నరకంలో పడవేస్తారు."

"అయ్యా! ఇక తప్పించుకునే మార్గమే లేదు. నీవు పాపాలు చేయడం మానితే తప్ప తప్పించుకోలేవు. ఇక నీ యిష్టం".

అతడిప్పుడు పాపాలు చేస్తే ఎలా ఆ లోకాధీశుడినుండి తప్పించుకోలేమో తెలుసుకున్నాడు. ఇబ్రహీం అద్హం (రహ) వద్ద క్షమాపణలు కోరుకున్నాడు. సరైన మార్గంలో నడవ ప్రారంభి చాడని లోకులు చెప్తారు.

# 7. వస్తువులోని పరమార్థం



హజ్రత్ అబ్దుల్లా బిన్ జాఫర్ (రజి) ఒకప్పుడు అడవిలో పోతున్నారు. త్రోవలో ఒక అందమైన తోట కనిపించింది. ఆ తోటలోకి వెళ్లారు. ఆ తోటలో ఒ నీగ్రో బానిస పనిచేస్తున్నాడు. అతని కోసం రొట్టెలు తెచ్చి ఒకతను ఇచ్చాడు. ఆ తెచ్చే వాని వెంట ఒక కుక్క వచ్చింది. అది ఆకలితో ఆవురావురు మంటుంది. నోరు బాపుతూ, తోక ఆడిస్తూ బానిస వద్దకు వెళ్లి చుట్టూ తిరగడం ప్రారంభించింది. బానిస దాని ఆకలి గ్రహించాడు.

ఒక రొట్టె కుక్కకు వేసి, తనపని చేసుకుంటున్నాడు. కుక్క ఆ రొట్టెను తొందర తొందరగా తినివేసి, మరల మోర యెత్తి, యింకా ఆహారం కావాలని చూడసాగింది. బానిస రెండో రొట్టె వేశాడు. అంతటితో అది ఉపశమించలేదు. ఇంకా కావాలని చూచింది. మూడో రొట్టెకూడా వేసేశాడు. తన ఆహారం నిమిత్తం పంపినవి మూడే రొట్టెలు. అ మూడూ కుక్కకు వేసేశాడు,

అబ్దుల్లా బిన్ జాఫర్ (రజి) ఆశ్చర్యంతో చూస్తూ ఆ బానిసతో "ఏమయ్యా! నీకు ప్రతిరోజూ ఎన్ని రొట్టెలు వస్తాయి?" అని అడిగారు.

"తమరు చూస్తున్నారుగా! నాకు రోజూ మూడు రొట్టెలే వస్తాయి."

"ఒక్కదాన్నన్నా ఉంచుకోకుండా మూడు రొట్టెలు త్యాగం చేశావే!"

"ఏమండీ! ఇక్కడ కుక్కలే అసలు లేవు. ఈ బీదకుక్క చాలా దూరం నుండి ప్రయాణం చేసి వచ్చింది. అది యెంత ఆకలితో ఉందో! దాన్ని ఊరకే పంపేందుకు నాకు బుద్ధి పుట్ట లేదు. అందుకని నా ఆహారం దానికి పెట్టాను."

"మరి ఈ రోజు నువ్వేమి భోంచేస్తావు?"

"ఒకరోజు తిండి లేకపోతే ఫరవాలేదు. అదేం పెద్ద విషయం కాదు."

అబ్దుల్లా (రజి) తనలోతాను ఆలోచించ ప్రారంభించారు. "నన్ను అందరూ మహా దాని అంటారు. నేను ఎన్నెన్నో దానాలు చేశాను. దానధర్మాలకు పేరు పడ్డాను. నేను సంపన్నుణ్ణి, ఎన్ని దానాలు చేసినా తరగని సంపద నాది. మరి ఈ బానిస? ఇతని వద్ద ఉన్నవి మూడే రొట్టెలు. తాను ఈ రోజుకు పస్తుండి కూడా ఒక అల్ప ప్రాణియైన కుక్క ఆకలి తీరుస్తున్నాడు. ఇతడెంతటి పుణ్యాత్ముడు! నా కంటే, లోకంలో అందరికంటే మహా దాని ఇతడు"

ఇలా ఆలోచిస్తూ పట్టణానికి వెళ్ళిపోయారు. ఆ తోట యజమాని ఎవరో కనుక్కున్నారు. అతనివద్ద తోటను, బానిసను సర్వాన్ని యజమాని అడిగినంత యిచ్చి కొన్నారు. ఆ బానిసను పిలిచి. అతణ్ణి బానిసత్వం నుండి విముక్తుణ్ణి చేశారు. ఆ బానిసకే ఆ తోటనిచ్చి యజమానిని చేశారు

(ఇతే హాఫ్)

# ౧౮. సహనం

యాహ్యా బర్మకీ అబ్బాసీ రాజ్యానికి ప్రధాన మంత్రిగా ఉండేవారు ఒక రోజు తన సిబ్బందితో బయలుదేరి రాజవీధుల్లో పోతున్నారు. కొందరు గుంపుగా ఉండడం చూచారు. యాహ్యా ఆ గుంపు దగ్గర ఆగిపోయారు.

ఆ గుంపులో ఒకడు యాహ్యా బర్మకీనే తిడుతున్నాడు. యాహ్యా సేవకులు ముందుకు వెళ్లి అతణ్ణి పట్టుక వచ్చారు. కాని యాహ్యా బర్మకి తన నౌకర్లతో అతణ్ణి విడిచి పెట్టమన్నారు.

అతణ్ణి "ఏమయ్యా! నేనెవరో తెలుసా?" అని అడిగారు యాహ్యా.

"నీవు నాకు బాగా తెలుసు నీవు యాహ్యా బర్మకీ. నేను నిన్నే తిడుతున్నాను" అన్నాడు వాడు.

"నేను అబ్బాసీ రాజ్యపు ప్రధాన మంత్రిని అని కూడా తెలుసా?"

"ఆఁ నాకు ఆ విషయం కూడా తెలుసు."

"నేను తలుచుకుంటే నీ తల తీయించగలను తెలుసా?"

"అది కూడా నాకు తెలుసు."

యాహ్యా బర్మకీ ఆలోచనలో పడిపోయారు. కొద్దిసేపు తలవంచుకొని నిలబడ్డారు.

తర్వాత చాలా హుందాగా నిలబడి, సంయమనంతో "నేను నిన్ను అల్లాః కొఱకు క్షమించాను" అన్నారు.

అతడు ఆశ్చర్యంతో యాహ్యా బర్మకీ వైపు చూడ సాగాడు అప్పుడు యాహ్యా "ఆశ్చర్యంతో నా ముఖం ఏం చూస్తావు? ఎవరి దగ్గర ఏముంటుందో అదే యిస్తారు. నీ వద్ద నా కోసం తిట్లున్నాయి. అవి నాకిచ్చావు. నా దగ్గర నీ కోసం సహనం, ఓర్పు. క్షమ ఉన్నాయి. అవి నీ కిస్తున్నాను" అన్నాడు హుందాగా.

తిట్టినవాడి విస్మయానికి, ఆవేదనకు మేరలేదు.

—ooo—

ఈ రచయిత యొక్క యితర పుస్తకములు (ఉర్దూ భాషలలో)

1. హాఫీజుల్–ఖవాయిద్ (వ్యాకరణము)
ఆంధ్ర. అన్నామలై, మద్రాసు మరియు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారిచే
VII th ఫామ్, పి. యు. సి. మరియు బి. ఏ., కు
పాఠ్య గ్రంథముగా అంగీకరింపబడినది. వెల 8-00
2. ఫిర్–దౌసె–నజర్ (ఉదయగిరి చరిత్ర) వెల 2-00
3 ముఖ్ తసర్–తారీఖ్–ఆలమె–ఇస్లాం
(ఇస్లాం చరిత్ర) వెల 8-00
4. ఖవాయె–నూర్ (సూక్తిముక్తావళి) వెల 6-00
5. లమ్ఆత్–ఎ ఈమానీ ,, వెల 6-00
6. పహిలి మంజిల్ (కఫన్ ఓ దఫన్ కె మసాయిల్) వెల 3-25
7. ఇన్సానియత్–కె–చరాగ్ వెల 4-00
8. తోషా–ఎ–అఖిరత్ వెల 6-00
9. దురె–బే–బహా వెల 6-00
10. చహల్ హదీస్ వెల 1-00
11. నాయబ్ జవాహెర్ వెల 20-00
12 మానవతా దీపం (తెలుగు) వెల 6-00
13 కాంతి కిరణము (తెలుగు) వెల 8-00
14. కఫన్ ఓ దఫన్ (తెలుగు) వెల 1-25
15. అసాన్ నమాజ్ (తెలుగు) వెల 5-00

కావలసినవారు ఈ క్రింది అడ్రసుకు వ్రాయగోరుచున్నాము.

జఫర్ బుక్ డిపో,

కచ్చేరిమిట్ట, కావలి, నెల్లూరు జిల్లా.

# *KANTI SIKHARALU*

By

**P. HUSSAIN KHAN**

ADIB-I-FAZIL

NATIONAL AWARDEE

Rt. Spl. CATEGORY URDU MUNSHI

K A V A L I, Nellore Dt.



**Price Rs. 6-00**

Publisher :

**MAKTAB-E-NOOR**

Muslimpura, KAVALI, Nellore Dt. (A.P)